12/91

కలవరింతలు... పలవరింతలు... పులకరింతలు...
చక్కిలిగింతలు పెడుతూ... ప్రతిపేజీ ఒకింతకు
పదింతల హాయినిచ్చే...

# గిలిగింతలు

సరదా మాసపత్రిక



## విజ్ఞానం, వికాసం,
## వినోదాల సంగమం!



# బాలప్రపంచం

విశ్వవిజ్ఞానమాస పత్రిక

వివరాలకు:

**బాలప్రపంచం** నెం: 3, ముత్తుకృష్ణాస్ట్రీట్, టి. నగర్, మద్రాసు-600 017.



# శ్రీనివాస కల్యాణం

సరస్వతీ నదీతీరంలో కొందరు ఋషిపుంగవులు యజ్ఞం నిర్వహించారు. ఆ యజ్ఞఫలాన్ని త్రిమూర్తులలో ఎవరికి అర్పించవలసినదీ చెప్పవలసిందిగా నారదమహర్షిని వేడుకున్నారు. త్రిమూర్తులను పరీక్షించి యజ్ఞభోక్తను నిర్ణయించగల శక్తి భృగుమహర్షికి మాత్రమే ఉంది'' అని నారదుగు చెప్పాడు.

భృగువుకు అరికాలులో కన్ను ఉంది. అసలే అహంకారి. ముందు బ్రహ్మ వద్దకు వెళ్ళాడు. అయితే ఆ సమయంలో సరస్వతీ వీణానాదం వింటూ మైమరచి ఉన్న బ్రహ్మ భృగువు రాక గమనించలేదు. భృగువు కోపంతో బ్రహ్మను అపూజ్యుడవు కమ్మని శపించాడు. అందువల్లే బ్రహ్మకు దేవాలయాలు లేవు.

అనంతరం కైలాసం వెళ్ళాడు భృగువు. తాండవ నృత్యంలో ఉన్న పార్వతీ పరమేశ్వరులు కూడా భృగువు రాక గమనించలేదు. భృగువు కోపంతో ''శివప్రసాదం అగ్రాహ్యం అగుగాక'' అని శాసించాడు. అందువల్లే శివుని గుళ్ళో ప్రసాదం ఇవ్వరు.

ఆ తరువాత వైకుంఠం వెళ్ళాడు భృగువు. ఆ సమయంలో శ్రీ మహావిష్ణువు శ్రీదేవి కోమల కరపల్లవములతో పాదసేవ పొందుతూ మెమరచి ఉన్నాడు. భృగువు శాపం ఇవ్వడం కూడా మర్చిపోయి కోపం తెచ్చుకుని శ్రీదేవి స్థానమెన శ్రీహరి వక్షస్థలంమీద తన్నాడు. శ్రీహరి ఉలిక్కిపడి మహర్షిని చూసి— ''అయ్యయ్యో మహర్షీ ఎంత అపచారం జరిగింది! కఠినమైన నా వక్షస్థలంమీద సున్నితమైన మీ పాదం తగిలి ఎంత నొచ్చుకుందో!'' అంటూ భృగువు పాదాలను పట్టుకుని అరికాలిలో ఉన్న అహంకార నేత్రాన్ని అంతం చేశాడు.

అయితే తన స్థానాన్ని అవమానం చేసిన వ్యక్తిని గౌరవించడం భరించలేని శ్రీ మహాలక్ష్మి వైకుంఠం వీడి వెళ్ళిపోయింది. విరహవేదన భరించలేని శ్రీ మహావిష్ణువు శ్రీనివాసు

(ముఖచిత్ర కథ)

డుగా అవనిమీద అవతరించాడు. వకుళాదేవి మాతగా అల్లారుముద్దుగా ఉండేవాడు.

మహాలక్ష్మి అంశతో ఆకాశరాజుకు పద్మావతి జన్మించింది. ఆమె అపూర్వ సౌందర్య రాశి. ఒక రోజు వేటకని అశ్వంమీద వెళుతున్న శ్రీనివాసుడు ఆమెను చూశాడు. ఆయన నేత్రాలు వికసించాయి. పద్మావతి తొలి చూపులోనే శ్రీనివాసుని చూసి పరవశించిపోయింది.

ఆమె ఆకాశరాజు కుమార్తె పద్మావతి అని తెలుసుకున్న శ్రీనివాసుడు ఆమెను తనకి కన్యాదానం చెయ్యవలసిందిగా కోరవలసిందిగా తల్లిని అర్థించాడు. ఆ కోరిక ఆమెను నిర్ఘాంతపరచింది. అయినా కొడుకును చిన్నబుచ్చలేక వెళ్ళి ఆకాశరాజును అడిగింది. ఆకాశరాజు వకుళాదేవితో అంతస్థులు ప్రస్తావించి అవమానం చేశాడు. అయితే ఆకాశరాజువద్దకు సకల దేవతలూ వెళ్ళి శ్రీనివాసుడంటే సామాన్యుడు కాదనీ, శ్రీహరి అనీ, పద్మావతి సాక్షాత్తు లక్ష్మీదేవి అవతారమనీ చెప్పారు.

"అది నిజమే అయినా ఇప్పుడు పద్మావతి నా కూతురు. డబ్బు లేని శ్రీనివాసునికి ఎలా ఇవ్వగలను?" అని అడిగాడు.

శ్రీనివాసుడు విషయం తెలుసుకుని కుబేరుడివద్ద డబ్బు తెచ్చుకున్నాడు. కుబేరుడు "మహానుభావా! మహాలక్ష్మికి పతివైన నీకీ ఐశ్వర్యం అప్పుగా ఇచ్చే అదృష్టం నాకు కల్గింది. అయితే లాభం లేకుండా ఇవ్వడం వల్ల లక్ష్మిని అవమానించడం అవుతుంది. లక్ష్మీనాథుడు అయిన నీకే ఆ వియోగం తప్పలేదు. ఆమె పుత్రుడిని. అందువల్ల నా వడ్డీ అసలు ఎలా తీరుస్తారో మీరే సెలవివ్వండి" అన్నాడు.

"కుబేరా! కలియుగ ప్రత్యక్ష దైవం ఏడుకొండలస్వామిగా తిరుమలమీద వెలుస్తాను. కలియుగాంతం వరకూ నాకు భక్తజనులు ఇచ్చే కానుకలతో నీకు వడ్డీ చెల్లిస్తాను' అని వివరించాడు శ్రీనివాసుడు.

పద్మావతీ శ్రీనివాసుల కళ్యాణం ఘనంగా జరిగింది. శ్రీమన్నారాయణుడైనా సరే లక్ష్మిస్థానాన్ని అవమానం చేయించినందుకు అప్పు తీసుకుని వడ్డీ కట్టాల్సిన పరిస్థితి ఏర్పడింది.

అందుకే పెద్దలు ఎట్టి పరిస్థితుల్లోనూ లక్ష్మిని నిర్లక్ష్యం చేయకూడదంటారు. *



# తాతయ్య కబుర్లు

పొట్లూరి వెంకటాచారి

ప్రశ్న: క్రీస్తు జన్మించిన నెల ఇది. కనుక ఓ క్రిస్మస్ సంఘటన చెప్పు తాతయ్యా!

— పీటర్ అల్ఫోన్స్ (ఢిల్లీ)

* 1780-వ సంవత్సరం క్రిస్మస్ పండుగ ముందురోజు రాత్రి, పారిస్ నగరాన్ని పశ్చిమ జర్మనీ సేన ముట్టడించింది. ఫ్రెంచ్ సేనలూ ఎదురు దాడి జరిపి నగరాన్ని కాపలా కాస్తున్నారు.

అంత ముమ్మరంగా పోరు జరుగుతున్న సమయంలోనూ ఓ ఫ్రెంచ్ వీరుడు తమ దళపతి వద్ద తీసుకుని ధైర్యంగా పశ్చిమ జర్మనీ సేనల వద్దకు పోయి "నోయల్ క్రీస్తు ప్రభువు జన్మించారు!" అంటూ గట్టిగా అరిచి క్రిస్మస్ పాట పాడాడు.

ఆ వెంటనే పశ్చిమ జర్మనీ సైనికులు కూడా శత్రుత్వం మరిచి, ఆ ఫ్రెంచ్ వీరుడి పాటకు తామూ శృతి కలిపారు. ఈ విధంగా రెండు గంటలసేపు సాగింతర్వాత మళ్లీ యుద్ధం కొనసాగింది.

'క్రీస్తు యొక్క నామం' ఓ మహా సంగ్రామాన్ని రెండు గంటల సేపు సమాధాన పరిచింది.

ప్రశ్న: డబ్బుతో సాధించలేనిదంటూ ఏదైనా వుందా?

— జి. ఎస్. కుమారి (తాడేపల్లిగూడెం)

* పదివేల రూపాయలు తగలేసి ఓ ఖరీదైన కుక్కని కొనుక్కొచ్చి, ఇంట్లో కట్టిపడేసి "నీ కోసం నేను పదివేల రూపాయలు ఖర్చు పెట్టా"నంటూ చెప్పి చూడండి! అది తోక ఆడిస్తుందా? రెండు, మూడు సార్లు అదే మాట తిరిగి అని చూడండి! అందుకు అది తోక ఆడించదు సరి కదా మీవంక 'గుర్ర్' మంటూ చూస్తుంది కరవడానికి! అదే కుక్కని ప్రేమగా నిమిరి, ఓ బిస్కెట్ ముక్క పడేసి చూడండి! అవలీలంగా అది తోక తెగ ఆడించి పారేస్తుంది!!

ఓ కుక్క సంగతే ఇలా వుందంటే, డబ్బుతో సాధించలేనివి ఇంకా ఎన్నో వున్నాయి తల్లీ!



ప్రశ్న: తాతయ్యా! 'కృషితో నాస్తి దుర్భిక్షం' అంటారు కదా.... అదెలా?

—వై. ప్రమీం (పెద్ద కోట్టాల)

* ఓ గ్రామంలోవున్న జ్యోతిష్కుడు "ఇంక ఈ వూళ్ళో 12 సంవత్సరాల వరకు ఒక్క వాన చుక్క కూడా కురవదు" అంటూ ఖచ్చితంగా తేల్చి చెప్పేశాడు.

దాంతో ఆ వూళ్ళో జనాలందరూ ఉసూరుమని వారి వారి ఇళ్ళల్లో కాలక్షేపం చేయసాగారు.



కానీ, ఒకే ఒక రైతుమాత్రం 'ఆ వానేదో కురిసేప్పుడే కురవనీ' అంటూ తన పొలాన్ని దున్నుకోసాగాడు.

ఈ దృశ్యాన్ని పైనుండి చూసిన మేఘాలన్నీ "మనం ఇంకా పన్నెండు సంవత్సరాల వరకూ కురవబోమని ఖచ్చితంగా తెలిసికూడా ఈ రైతు పొలం దున్నుకుంటున్నాడే! అనాశ్చర్యబోయి, అతడివద్దకొచ్చి "ఎందుకిలా కష్టపడుతున్నావు?" అనడిగాడు ఆసక్తిగా.

అందుకా రైతు "మీరు పన్నెండు సంవత్సరాలదాకా కురవరు... కానీ, ఆ పన్నెండు సంవత్సరాలూ నేను పొలం దున్నుకోకుండా ముసుగుతన్ని పడుకుంటే ... నాకు పొలం పనులన్నీ అలవాటు తప్పిపోవడంవల్ల బొత్తిగా మర్చిపోయే ప్రమాదముంది. అపై మీరు వాన కురిపించినా నాకు ప్రయోజన ముండదు!" అంటూ వివరించి తిరిగి తన పొలం పనుల్లో మునిగిపోయాడు.

ఇది వినడంతోటే మేఘాలన్నీ వణికిపోయాయి.

'మనం ఇలా పన్నెండు సంవత్సరాలు వర్షించకుండావుంటే అలవాటు తప్పి, బొత్తిగా కురవడమే మర్చిపోతామేమో?' అనుకుంటూ ఆ రైతు పొలంలో మాత్రం భోరున కురిశాయి!

కనుక, దేనిని గురించీ ఆలోచించకుండా ముందు నీ కృషేదో నువు చేసెయ్' అనేది నా సలహా!

ప్రశ్న: ఏది నాగరీకం? ఏది అనాగరీకం? వివరించవూ....?

— జె. ఎస్. నారాయణ (మద్రాసు)

* ఓ భర్త - ఓ భార్య.

ఏదో కారణంగా ఇద్దరి మధ్యా భేదాభి

ప్రాయాలు వచ్చాయి. భర్త విడాకుల కోసం కోర్టుకు వెళ్ళగా, దార్లో కలిసిన ఓ మిత్రుడు "ఇంతకీ నీ భార్య ఏం తప్పు చేసింది?" అనడిగాడు.

భర్త "ఇంకా విడాకులు తీసుకోలేదు. అందువల్ల ఇప్పుడు నా భార్య గురించి నేనేదీ చెప్పదల్చుకోలేదు" అంటూ వెళ్ళిపోయాడు.

విడాకులు తీసుకుని కోర్టు నుండి తిరిగొచ్చేటప్పుడు అదే మిత్రుడు "విడాకులు తీసుకున్నావుగా! ఇప్పుడు చెప్పు - నీ భార్యేం తప్పు చేసింది?" అనడిగాడు ఆసక్తిగా.

అందుకు భర్త "విడాకులు తీసుకున్నందువల్ల ఇప్పు డామె నా భార్య కాదు. కనుక పరాయిస్త్రీ గురించి నేను మాట్లాడడం తప్పు" అన్చెప్పి ముందుకు కదిలాడు.

ఎదుటివాడి భార్య గురించి ఒకడు అనాగరికంగా ప్రశ్నించినా, చివరి వరకూ భర్త నాగరీకంగా నడుచుకోవడం చక్కని సంస్కారం.

ప్రశ్న: చీకూ చింతా లేకుండా సంతోషంగా వుండాలంటే ఏం చెయ్యాలి?

— పి. ఎస్. కన్నియప్ప (నెల్లూరు)

* నాకు నచ్చిన రష్యాదేశపు జానపద కథ.

ఓ రాజుకి చాలా కాలంగా తీరని మనోవ్యాధి. రాజవైద్యులు అన్ని పరీక్షలూ చేసి "ఏ బాధా లేకుండా జీవించే వాడి శాలువాని తీసుకొచ్చి మహారాజు గారికి కప్పితే వ్యాధి మటుమాయ మౌతుంది" అంటూ సెల విచ్చారు. దాంతో రాజభటులంతా రాజ్యం నలుమూలలా వెదికారు. కానీ ప్రయోజనం లేకపోయింది. ఓ రాత్రి "దేవుడా! ఎప్పటిలా ఏ బాధా లేకుండా ఈ రోజూ హాయిగా గడిచి



పోయింది. రేపూ ఇదేలా వుండాలి... నేనిక నిద్రోతున్నా" నంటూ ఓ గొంతు వినబడ్డంతో ఆ దిక్కుగా రక్షక భటులు పడుతూ లేస్తూ పరుగెత్తుకెళ్ళి, ఆ వ్యక్తిని నిద్రలేపి "నీ శాలువా ఇవ్వు" అనడిగాడు.

దానికా వ్యక్తి తెల్లబోతూ "వీధి వీధీ తిరిగి అడుక్కు తింటూ బ్రతుకుతున్నోడ్ని... నా కాడ శాలువా ఎక్కడిది?" అన్నాడు.

లభించినదాంతో సంతోషపడిపోవడమే జీవితం! బాధ అన్నది మనకు మనంగా ఏర్పరచుకున్నదేనర్రా!

ప్రశ్న: కుల, మత భేదాలు అంతరించిపోయే రోజెప్పుడొస్తుంది తాతయ్యా?

— జి. వెంకటలక్ష్మి (రాజమండ్రి)

* నువ్వు నన్ను తలుచుకుని కోరుకుంటే నీ అవసరాలు తీరతాయంటూ కృష్ణుడు ఓ మునీశ్వరుడికి వర మిచ్చాడు. అడవి మార్గాన నడుస్తున్న మునీశ్వరుడికి దాహమేసింది. దాహం తీర్చమంటూ శ్రీకృష్ణుణ్ని తలుచుకున్నాడు. ఆ మరుక్షణం ఎదురుగా ఓ కోయవాడొచ్చి ముంత ఇవ్వబోయాడు. కానీ అతణ్ని హీన జాతి వాడిగా భావించి, ఆ ముంతను స్వీకరించకుండా ముందుకు నడిచాడు మునీశ్వరుడు. కాసేపటికి కృష్ణుడు ఎదురుగా రావటంతో "ఏమిటి కృష్ణా కోయవాడి కిచ్చి నీళ్లిచ్చి పంపావు?" అనడిగాడు.

అందుకు శ్రీకృష్ణుడు "మునీశ్వరా! మీకోసం దేవలోకంలో లభించే అమృతాన్ని ఇమ్మని ఇంద్రుడికి చెప్పాను. కానీ ఇంద్రుడు తమరు సర్వాన్ని త్యజించిన సన్యాసి అవునో కాదో పరీక్షించేందుకు కోయవాని వేషంలో వచ్చాడు. కానీ మీరు అతడి ఆత్మస్వరూపాన్ని గ్రహించక అమృతాన్ని వదులుకున్నారు" అన్నాడు.

ఏదేమైనా కుల, మత విద్వేషాన్ని విడనాడి మనిషిని మనిషిగా గుర్తించే 'మనుషుల' కాలం ముందుందని నమ్ముదాం!

ప్రశ్న: మీరు ఇష్టపడి కష్టపడేదెందుకు?

— వి. రాజారావు (తుని)

* మీచేత 'శభాష్' అనిపించుకునేందుకు!

*





# కలు అరుంధతి

విదర్భ దేశపు రాకుమారి అరుంధతి స్వయంవరం ప్రకటించారు. అయితే అరుంధతి మనసావాచా మాళవ దేశపు రాకుమారుడు కలుడిని ప్రేమించింది. కలుడికి కూడా అరుంధతి అంటే ప్రాణం. వారి ప్రేమ వ్యవహారమంతా అచ్చు నలదమయంతులంత బలంగా సాగింది. అరుంధతిని భైరవుడు అనే మాంత్రికుడు ప్రేమించాడు. అయితే అరుంధతి చిన్నప్పటి నుండీ కనకదుర్గ భక్తురాలు. కావడంతో విదర్భదేశంలో శక్తి పూజలు పుష్కలంగా జరగడం వల్ల భైరవుడు ఆటలు మంత్ర తంత్రాలు పని చెయ్యలేదు.

అయితే ఇపుడు రాకుమారికి విదర్భరాజు విశ్వసేనుడు స్వయంవరం ప్రకటించడం... దానికి ఆమె ప్రాణప్రదంగా ప్రేమించిన కలుడికి కూడా ఆహ్వానం అందడంతో భైరవుడికి ఏం చెయ్యాలో అర్థం కాలేదు. వివాహం కాకుండానే అరుంధతిని ఏం చెయ్యలేక పోయాడు. అదే పెళ్ళి అయిపోతే ఆమె మాంగల్యానికి కనకదుర్గ బాసటగా వుంటుంది. అందువలన యెలా అయినా సరే ఆ స్వయంవరం పాడుచెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

తన మంత్రశక్తితో దెయ్యాల నందర్నీ పిలిపించాడు. వాటినన్నింటినీ కలుడి ఆకారంలోకి మార్చి స్వయంవరానికి వెళ్ళమని. అనుజ్ఞ యిచ్చాడు. ఇంత మంది నకిలీ కలుడిల మధ్య అసలు కలుడిని అరుంధతి గుర్తించలేదు. స్వయంవరం నాశనం అవుతుంది, అని భైరవుడి పథకం! దెయ్యాలకు యిలాంటి వినాశమంటే యెంత సంబరమో వేరే చెప్పనవసరంలేదు! అవి రెట్టించిన ఉత్సాహంతో స్వయంవరంలో పాల్గొన్నాయి.

వి. ఎస్. రామచంద్రన్

స్వయంవరంలో ఇంతమంది కలుడి ఆకారాలను చూసి స్వయంవరం ఏర్పాటు చేసిన విశ్వసేనుడూ, స్వయంవరంలో ఉత్సాహంతో పాల్గొనాలని వచ్చిన కలుడూ కూడా నిర్ఘాంత పోయారు! కలుడికి మతిపోయినట్లు అయింది. తనే అసలు కలుడు అని చెప్పుకోడానికి వీలు లేదు. చెప్పినా నమ్మే పరిస్థితి లేదు. విశ్వసేనుడికి ఈ మాయాజాలం అర్థం కాలేదు. ఒక సారి స్వయంవరం ప్రకటించాక రద్దు చెయ్యడం రాజధర్మం కాదు. అందువలన భారం కనకదుర్గ మీద వేసి స్వయంవరం నడిపించాలనే నిర్ణయించుకున్నాడు.

విదర్భ రాకుమారి అరుంధతి వరమాల చేత ధరించి వచ్చింది. అక్కడ తన ప్రియుడి ఆకారంలో ఎందరో వుండడం గమనించింది. ఆమె పెదవుల మీద చిరునవ్వు! అందర్నీ పరిశీలనగా చూసింది. హంసలా నడుస్తూ అసలు కలుడి మెడలో హారం వేసింది. ఆమె ఎప్పుడైతే అసలు కలుడి మెడలో వరమాల వేసిందో భైరవుడి మాయాజాలం నశించి నకిలీ కలుడి ఆకారంలో వున్న దెయ్యాలు తమ ఆకారాలు దాల్చి మా య మై పో యా యి. రాజు ... వరుడు ... మొత్తం సభాస్థలి ఈ సంఘటనకు అదిరిపోయారు. కుమార్తె వంక వాత్సల్యంగా చూస్తూ విశ్వసేనుడు "అమ్మా! ఈ మాయాజాలం మేమే గ్రహించలేక పోయాం. నువ్వు ప్రేమించిన వరుడిని నువ్వు యెలా గుర్తించగలిగావు?" అని అడిగారు.

దానికి ఆమె "నాన్నగారూ! నా స్వయంవరం దమయంతీ స్వయంవరంలా తయారైంది. మహాసాధ్వి అయిన దమయంతిని పెళ్ళాడాలనే ఆశతో దేవతలంతా నల మహారాజు రూపంలో వచ్చారు. ఆమె కళ్ళకు అద్భుతశక్తివలన ప్రియుడిని గుర్తించి వర





మాల వేసింది. అయితే నేను మామూలు రాకుమారిని. నన్ను పెళ్ళి చెసుకోవాలని నా స్వయంవరాన్ని నాశనం చెయ్యడానికీ క్షుద్ర శక్తులే వస్తాయి. అవే కలమహారాజు రూపంలో వచ్చాయి. అందువలన వచ్చిన వారందరినీ మన కులదేవత కనకదుర్గను. తల్చుకుని చూశాను. ఒక్క కలమహారాజుకు తప్ప మిగతా ఆకారాలన్నింటికి కాళ్ళు వెనక్కి తిరిగి వున్నాయి. అంటే అవి దెయ్యాలు! వాటి చూపుల్లో క్రూరత్వం తప్ప సౌమ్యత లేదు. నా భర్తగా ఎన్నుకునే వ్యక్తిని నేను సులభంగా గుర్తించగలిగాను'' అంది.

విశ్వసేనుడు కుమార్తె కుశాగ్రబుద్ధికి పొంగి పోతూ వధూవరు లిద్దరికీ ఘనంగా వివాహం చేసాడు. దైవశక్తి ముందు క్షుద్రశక్తులు పని చెయ్యవని గ్రహించిన భైరవుడు సిగ్గుపడి మంచి మార్గంలో నడిచాడు.

*

## కనబడుటలేదు!



నాన్నగారూ —

నేను కనబడకుండా పోతున్నాను. ఈ చీటీతో పాటు నా పాస్‌పోర్ట్ సైజ్ కలర్ ఫొటో జతపరిచాను. నా ఎత్తు 166 సెం.మీ., బరువు 49 కిలోలు. వెళ్ళేప్పుడు ఎర్రచారల చొక్కా, బ్లూ కలర్ జీన్స్ ఫేంటూ వేసుకు వెళ్తున్నాను. వెంటనే టి.వీ. లో ప్రకటన చేయగలరని ఆశిస్తూ....

— నీ కొడుకు

# భలే మంచి బేరం

కథ: వి.చిట్టిబాబు

























రెండు.
హబ్బ..హబ్బ. మరొక్క దెబ్బ తింటే చాలు- గుర్రం నాదవుతుంది!


ఆ వ్యక్తి మూడవ దెబ్బకు సిద్ధమయ్యేసరికి మార్టిన్ తన గుర్రం ఎక్కి కూర్చున్నాడు!


యిదుగో- ఎక్కడికి వెళ్తున్నావ్?
ఇంటికి!


మరి- మరి- మన ఒప్పందం?
ఓ- అదా! నేస్తమా- కాసేపు ఆగాలి మరి!


నా దెబ్బతో మూడు దెబ్బలు తిన్నప్పుడే- ఈ గుర్రం నీదవుతుంది అంతేకదా?
అవును!


ఇప్పుడు ఎందుకో మరి నిన్ను మూడో దెబ్బ కొట్టాలనిపించటం లేదు!


కంగారు పడకోయ్. నాకు కొట్టాలనిపించినప్పుడు తప్పక చెప్తా.


మంచిది- మళ్ళీ కలుద్దాం!
?!

# మంచినే చూడు

ఒకసారి జీసస్ క్రైస్తు ఒక మార్గమధ్యంలో నిల్చుని వచ్చే పోయే వారిని చూస్తున్నారు. అక్కడ కొంత దూరంలో ఒక కుక్క శవాన్ని కాకి, గ్రద్దలు పొడిచి తింటున్నాయి. అటువైపు వెళ్తున్న వారందరూ ఆ దృశ్యాన్ని చూడలేక, ఆ కంపును భరించలేక కళ్ళూ, ముక్కూ మూసుకుని "ఛీఛీ ఈ పాడు కుక్కను ఎవ రిక్కడ వేశారు? ఎంత అసహ్యంగా బీభత్సంగా వుందో" అని అనుకుని గబగబా నడిచి వెళ్తున్నారు.

అపుడు జీసస్ "నాయనలారా! నిజమే! కుక్క చాలా భీభత్సంగానే కనిపిస్తుంది. కానీ దానిలో కూడా వున్న ఒత అందమైనదానిని మీరు చూడలేదు. దాని దంతాలు చూడండి ఎంత తెల్లగా వున్నాయో! అంత తెల్లని దంతాలు మానవునికి కూడా వుండవు! అటువంటి దంతాలు మీ దృష్టిని ఆకర్షించలేదు. మీరు దానినుండి వచ్చే దుర్వాసననే తలుచుకుంటున్నారు. మీలో లేదా దుర్వాసన? మీలో లేదా మాలిన్యం? ఒక్కసారి ఆత్మ పరిశీలన చేసుకోండి. ప్రతిదానిలో మంచినే చూడడం అలవాటు చేసుకోండి" అని ఎంతో మృదువుగా హెచ్చరించారు.

(ఈ కథ భగవాన్ శ్రీ సత్యసాయిబాబా దివ్యోపన్యాసాల నుండి స్వీకరించబడినది.)



# చిత్రం! విచిత్రం!!

## మేధా వినోదం

—వక్కలంక 'కిషోర్'

ఆ రోజు సాయంత్రం సినిమా చూసి, కాళ్లీడ్చుకుంటూ ఇంటికి చేరాం నేనూ, అనిల్ గాడూ, శ్యామలా!! వీధి అరుగుమీద మామయ్య కూర్చుని వున్నాడు.

''ఏరా! చాలా లేటయిందే! అన్నట్టు రామం మీతో రాలేదా?'' అడిగాడు.

''వచ్చాడు. భోంచేసి వస్తాడు. వాళ్ళింట్లోకి వెళ్ళాడు'' నే నన్నాను.

''సర్లెండి. మీరు కూడా భోం చేయండి.''

భోజనాలయాక ఎప్పటిలా అరుగుమీద చేరాం మామయ్య దగ్గర. రామంగాడు మూతి తుడుచుకుంటూ వచ్చాడు.

అనిల్ గాడు రామాన్ని చూపిస్తూ, ''మామయ్యా! వీడికి సినిమా ఎందుకు చెప్పు. థియేటర్ దాకా వచ్చాడా? ఒరే డబ్బులు తక్కువొచ్చాయిరా కాస్త అప్పివ్వండి'' అన్నాడు. సరే! అప్పిచ్చువాడు వైద్యుడు కదా! మనం ఎలాగా MBBS చదువుదామనుకుంటున్నాం కదా అని జేబులో చెయ్యిపెట్టి 'ఐదుకి ఎంత తక్కువుందిరా?' అన్నాను. జేబులోంచి రూపాయి తీసి 'మిగిలిన నాలుగూ' నన్ను సర్దమన్నాడు'' అన్నాడు.

''సర్దావా?'' నవ్వాడు మామయ్య.

''ఆఁ! డిసెంబర్ కదా! సర్దీగా వుంది. చేతులు వేడి పుట్టాలని ఆ నాలుగుతోపాటు మరో నాలుగు టెంకిజెల్లలు కూడా వాడి నెత్తిమిద ఆ సర్దీలో సర్దాగా సర్దాను'' అన్నాడు అనిల్. రామంగాడు తన తల తడుముకున్నాడు.

''తప్పురా అనిల్! వాడేదో అవసరమై అడిగాడు. తిరిగిస్తాడుగా!'' మామయ్య మందలించాడు.

''పుటం పెట్టినా ఇవ్వడు'' అన్నాడు అనిల్.

మామయ్య నవ్వి, ''నీ కళ్ళముందు నుంచి వాడు ఎక్కడికి పోతాడ్రా బోడి నాలూపాయలూ నువ్వనూ! అయినా అప్పివ్వడానికి వాడేమైనా ప్లాస్టిక్ సర్జరీ చేయించుకోడానికి అడిగాడా? సినిమాకేగా?'' అన్నాడు.

మాకు అర్థం కాలేదని గ్రహించి మళ్ళీ తనే ఇలా అన్నాడు.

''ఔనా! ఒకాయన ఇలాగే ఓ ఆసామికి

'నాలెడ్జి లేకుంటే అరుగు మీంచి పడిపోతావురా అనిల్' అన్నాడు మామయ్య. విజ్ఞానం లేకుంటే అరుగు మీంచి పడడమేమిటి? ఏమి టిందులో విచిత్రం?

నాలుగు వేలు అప్పిచ్చాట్ట, మొఖం ప్లాస్టిక్ సర్జరీ చేయించుకోడానికి! తీరా చూస్తే అప్పు తీర్చ మని అడగడానికి ఆ అసామీని గుర్తుపట్టలేక తల పట్టుకున్నాట్ట. అందుకే ఒక్క ప్లాస్టిక్ సర్జరీకి తప్ప దేనికేనా అప్పివ్వచ్చన్నారు అర్యులు!'' అది సరే. ఇంతకీ ఏ సినిమాకి వెళ్ళారు?''

''చెప్పుకో చూద్దాం!''

''ఆఁ!...కొండవీటి చేంతాడు!''

''కరెక్ట్! భలే చెప్పావే! ఎలా?'' అన్నాను ఆశ్చర్యంగా!

''ఔన్రా! మీరు వచ్చేసరికి చాలా లేట యింది. పెద్ద సినిమా అయివుండాలి అను కున్నాను. కొండవీటి నాగులు, కొండవీటి సింహం, కొండవీటి రాజా, కొండవీటి దొంగ, కొండవీటి రౌడీ ఇన్ని రాగా లేంది 'కొండవీటి చేంతాడు' రావడంలో ఆశ్చర్యం ఏముంది? అని లెక్కేసానంతే!''

మామయ్య లాజిక్‌కి ''వహ్వా!'' అన్నాం మేం! అనిల్‌గాడైతే నవ్వుతూ ''భలే కనిపెట్టావ్ మామయ్యా!'' అంటూ అరుగుమీద గంతు లేయడం మొదలెట్టాడు.

''ఒరే అనిల్! KNOW LEDGE లేకుంటే అరుగు మీంచి పడిపోతావు'' అన్నాడు మామయ్య. నాకు ఆశ్చర్యం వేసింది. ''అదే మిటి మామయ్యా! నాలెడ్జి అంటే విజ్ఞానం కదా! అది లేకుంటే అరుగుమీంచి పడడ మేమిటి?'' అన్నాను.



మామయ్య నవ్వి "KNOWLEDGE కలిపి కాదురా నే నన్నది, 'KNOW LEDGE' అని! LEDGE అంటే అంచు. KNOW LEDGE అంటే 'అంచు తెల్సుకో'. అంచెక్కడుందో తెలియకుంటే హాస్పిటలేగా శరణం మరి!" అన్నాడు.

"KNOWLEDGE లేకున్నా జీవితంలో పడిపోక తప్పదులే" అన్నాడు తనే మళ్ళీ.

"సరే. ఈసారి ఏ రంగంలో మా నాలెడ్జి టెస్ట్ చేయబోతున్నావ్?" అన్నా డనిల్.

"మరింకేం రంగం? సినిమా రంగంలోనే!" అనగానే నాకు భలే హుషారొచ్చింది. అసలదే నా ఫేవరెట్ సబ్జెక్ట్ కదా!

"సినిమాల గురించి మాటాడాలంటే చాలా వుంది కానీ మన కిక్కడ స్కోప్ లేదురా!" అన్నాడు మామయ్యే.

"స్కోప్ లేకుంటే 35 M. M. లోనే మాట్లాడు" అన్నా న్నేను.

## బుజ్జాయి పజిల్

ఇక్కడ నాలుగు దారం ముక్కలు చిక్కు పడిపోయాయి. ఇందులోని ఓ దారం కొసకు 'బహుమతి' జతచేయబడింది. కుడివైపునున్న నాలుగు దారం కొసలలో ఏ కొస లాగితే 'బహుమతి' మీ స్వంతమౌతుందో కనుక్కొని, ఆ అంకెను ఓ కార్డుముక్క మీద వ్రాసి డిసెంబర్ 15 వ తేదీ లోపు మాకు చేరేలా పంపండి.

సరైన సమాధానం ఒకరి కంటే ఎక్కువ మంది వ్రాస్తే డ్రా పద్ధతిలో ముగ్గుర్ని ఎంపిక చేసి ఒక్కొక్కరికీ 50 రూ॥లు చొప్పున పంచడం జరుగుతుంది. ఇక మిగిలిన విజేతల్ని రెండవసారి డ్రా పద్ధతిలో పది మందిని ఎంపిక చేసి వారికి ఆ నెల 'బుజ్జాయి'ని బహుమతిగా పంపబడుతుంది. ఫిబ్రవరి 92 సంచికలో విజేతల వివరాలు ప్రచురించబడతాయి.

మీ రీ సమాధానం పంపవలసిన చిరునామా:

BUJJAYI PUZZLE
27, Gopala Krishna Street,
T. Nagar, Madras-600 017.




# గెల్చుకోండి! బహుమతి 15 వేలు!!

(పైసలు మాత్రమే)



అనిల్ గాడైతే, "వివరణలూ, ఉపన్యాసాలూ వగైరా సుత్తి వదిలేసి డైరెక్టుగా ప్రశ్నాపత్రం లోకి వెళిపో మామయ్యా! నా కసలే నిద్రొస్తోంది" అన్నాడు.

"అసలా సుత్తెక్కడిది నాయనా? జంధ్యాల గారు నాలుగు స్తంభా లాటాడించి మన కంట గట్టింది కదూ! తెలుగు డిక్షనరీలో సైతం చేర్చేసుకోదగినంత పాపులర్ అయిపోయింది కదరా అదీ!"

"అదుగో! మళ్ళీ చరిత్ర అడక్కపోయినా చెప్పింది వినిపించేస్తున్నావే!" అన్నాను.

"ఇది మాత్రం సినిమా డైలాగ్ కాదా? ఒరేయ్! పెద్ద పరిశ్రమ, కళ, వ్యాపారం... ఏదీ అంటే అది సినిమాయే!! దాన్ని గురించి నాల్గు ముక్కలు చెప్పుకోని ముందుకి సాగుదాం" అంటూ ఇలా చెప్పాడు మామయ్య, తన ఉపన్యాస ధోరణిలో

"సుమారు అర్ధ శతాబ్ది క్రిందట ఆరంభమై దినదిన ప్రవర్ధమానమైన మన తెలుగు చిత్రపరిశ్రమలో ఎ ఎన్నార్, ఎన్టీఆర్, ఎస్వీఆర్ లాంటి మహానటు లెందరో పాతాలు నేర్చుకుని ఊహించని ఎత్తు కెదిగారు. శిల్పం, చిత్రలేఖనం, కవిత్వం, నాట్యం, గానం - కలబోసిన సరికొత్త లలితకళ సినిమా. దీన్ని తెలియని వాడు దాదాపు లేడని చెప్పవచ్చు. ప్రపంచ చలన చిత్రరంగంలో మనకంటూ ఓ ప్రత్యేక స్థానాన్ని కల్పించిన దర్శకులు, తేనెలూరే పాటలు రాసిన మహాకవులు, చవులూరించే కంఠ మాధుర్యాన్ని ఒలకబోసిన గాయనీ గాయకులు, తీయని బాణీల నందించిన సంగీత దర్శకులు, బహువిధ నృత్యరీతులచే అలరించిన నృత్య దర్శకులు, మేకప్‌మెన్, టెక్నీషియన్లూ, అతిరథులూ, మహారథులూ...ఎందరి శ్రమ ఫలితం సినిమా అంటే..." అంటూ చెప్పుకుపోతున్నాడు, కళ్ళు మూసుకుని.

"ఈ ఉపన్యాసం అనేది ఎవడు కనిపెట్టాడ్రా బాబూ!" అన్నాడు అనిల్‌గాడు తల పట్టుకుని.

"మానవా! ఈ ఉపన్యాసం మానవా?" అన్నాను నేను.

"రామంగా డేడీ?" అన్నాడు మామయ్య కళ్లు తెరిచి.

"ఎక్కడికో ... వెళ్ళిపోయాడు" అంది శ్యామల.

అంతే మామయ్య "సర్లెండి. మీ కందరికీ ఇబ్బందిగా వుంటే నా కెందుకు కంఠశోష? అయినా తెలియనిదాన్ని గూర్చి మాట్లాడాలి గానీ..." అన్నాడు.



''అది సరే మామయ్యా! ఒకోసారి సినిమా హిట్ అవుతుందన్నది ఫ్లాప్ అవుతుంది. పోతుందనుకున్నది హిట్ అవుతుంది కదా! అసలు మంచి సినిమా తీయడానికి సూత్రం ఏమిటి? ఎపుడేనా నేను సినిమా తీస్తే ఉప యోగపడ్తుంది'' అన్నాడు అనిల్.

రామంగాడు, ''ఒరే! అనిల్! నువు సిన్మా తీస్తే నన్ను హీరోగా పెట్టుకోరా!'' అన్నాడు.

''ఏడిశావ్‌లే! సిన్మా లేదూ బడ్జెట్ లేదూ హీరో పేరు రామలింగం! పోనీ ఇందాకా ఇచ్చిన నాల్రూపాయలూ ఎడ్వాన్స్ అనుకో. నీ వెధవ మొహం ప్లాస్టిక్ సర్జరీ చేయించుకోవాలిగా హీరో ఐతే!'' అన్నాడు అనిల్.

ఆ తర్వాత మామయ్య మాట్లాడుతూ ''హిట్ అవడానికి ప్రత్యేక సూత్రాల్లేవుగానీ ఒకటి మాత్రం నిజం: ఆ నటీనటులు కాకుండా ఆ సిన్మాలోని పాత్రలు మాత్రమే కనిపించిన ప్రతి సినిమా హిట్టయింది. శంకరాభరణంలోని జె. వి. సోమయాజులుగార్ని ఇప్పటికీ 'శంకర శాస్త్రి'గారనడం వినలేదూ! అదన్నమాట!'' అన్నాడు. తర్వాత మాకో గీసిన బొమ్మ



చూపించి 'ఈ బొమ్మలోని నటుణ్ని' గుర్తించ గలరా?' అన్నాడు.

''నేను కనిపెట్టలేననుకున్నావా? 'రాళ్లపల్లి' మారువేషంలో బొమ్మ ఇది'' అన్నా డనిల్.

''ఇంకా నయం. మధ్యలో వున్న బొమ్మ అన్నావు కాదు. ఆయన డా॥ గోవిందరాజుల సుబ్బారావుగారనీ పాత నటుడు.''



''ఫొటోలైతే చెప్తాం గానీ గీసిన బొమ్మ లెలా చెప్తాం?'' అన్నాడు వాడు.

అలాగా అంటూ మామయ్య ''ఎవరోపోల్చుకో'' అంటూ ఈ బొమ్మ ఎదర పెట్టగానే ''NTR'' అన్నాడు

''చూశావా? కళ్ళు కూడా గీయలేదు. పైగా ఈ బొమ్మ ఈనాటిది కూడా కాదు. మన దేశం చిత్రం కోసం 1949 లో NTR తీయించు కున్న తొలి స్టిల్ ఆధారంగా గీసినది. అయినా కనిపెట్టావ్! బుర్ర వుండాలే కానీ, పరిచయం



వుంటే పట్టుకోడం ఎంత? సర్లెండి ఈయ నెవరో చెప్పండి.'' అని మామయ్య అంటూండగానే

చూస్తూనే "ఎల్. వి. ప్రసాద్‌గారు, 1946 లోని 'గృహప్రవేశం' సినిమాలోది ఇది" అంటూ అరిచా న్నేను.

నా నాలెడ్జిని మెచ్చుకుంటూ "ఓ. కే. ఇక పుచ్ఛరహితముచ్ఛుల్లారా! నా పృచ్ఛగుచ్ఛాన్ని పుచ్చుకోండి" అంటూ ప్రశ్నల్ని ఇలా అందించాడు మామయ్య :



1. అక్కినేని, కృష్ణ మామ అల్లుళ్లుగా నటించిన చిత్రం ఏది?

2. యస్. పి. బాలసుబ్రహ్మణ్యం పాట పాడిన తొలిచిత్రం 'శ్రీశ్రీశ్రీ మర్యాద రామన్న' అని మీకు తెల్సు. మరి ఘంటసాలగారి తొలిచిత్రం చెప్పగలరా?

3. అక్కినేని ఆప్తమిత్రుడు, రాజీవ్ గాంధీ ఉపన్యాసాలకి తెలుగు అనువాదకుడుగా వున్నారు. ఆయన పేరేటి?

4. రామారావు, నాగేశ్వరరావుగార్లు మామా అల్లుళ్ళుగా నటించిన సూపర్ హిట్ చిత్రం?

5. ఈ కింద ముగ్గురు పాత నటీనటు లున్నారు? వారిని గుర్తించగలరా?







మాకు ఆవులింత లొస్తున్నాయి. మీరేనా ఆన్సర్లు పట్టుకుని డిశెంబరు 15 వ తేదీలోపు ఓ కార్డుముక్కమీద వ్రాసి పంపండి.

సరైన సమాధానం ఒకరికంటే ఎక్కువ మంది వ్రాస్తే డ్రా పద్ధతిలో ముగ్గుర్ని ఎంపిక చేసి ఒక్కొక్కరికీ 50 రూ॥ లు చొప్పున పంపడం జరుగుతుంది. ఇక మిగిలిన విజేతల్ని రెండవసారి డ్రా పద్ధతిలో పది మందిని ఎంపిక చేసి వారికి ఆ నెల 'బుజ్జాయి'ని బహుమతిగా పంపబడుతుంది. ఫిబ్రవరి '92 సంచికలో విజేతల వివరాలు ప్రచురించబడతాయి.



# ప్రేమ సామ్రాజ్యం

పున్నమి వెన్నెలకంటే చల్లదనం కురిపించే అపూర్వ నేత్రాలు కల పరమ దయామయురాలు మరియా. ఆమెకు జోసెఫ్‌తో వివాహం నిశ్చయమైంది. ఆ సమయంలో మరియా భావి వివాహ జీవితం గురించి కలలు కంటూ నిద్రించిన తరుణంలో ఆమెకు ఒక అపూర్వమైన కల వచ్చింది. ఆ కలలో దేవదూత గాబ్రియేల్ సాక్షాత్కరించింది.

వినయంగా ఆ దేవదూతకు నమస్కరించింది మరియా. మరియా వంక గాబ్రియేల్ వాత్సల్యంగా చూస్తూ "అమ్మా! మరియా! నువ్వు అపూర్వ భాగ్యశాలివి! దైవకుమారుడు నీ కడుపున జన్మించనున్నాడు! కన్యగా తల్లివి అయి పూజలందుకునే అదృష్టం నీకు రానుంది!" అని చెప్పింది. మరియా గర్భవతి అయింది.

ఆ విషయం తెలిసి ఆమెను వివాహం చేసుకోవాలనుకున్న జోసెఫ్ మానసికంగా కృంగిపోయాడు. ఆ రాత్రి అంతా కలతచెంది మరియాని వదిలి వేయాలని నిర్ణయించుకున్నాడు. అప్పుడు జోసెఫ్ ముందు దేవుని వెలుగు ప్రత్యక్షమైంది. "జోసెఫ్! ఇది దైవ కార్యం! మరియా పరమ పవిత్రురాలు! నువ్వు ఆ బిడ్డకు తండ్రిగా వ్యవహరించు!" అని చెప్పింది.

జోసెఫ్ మహదానందపడుతూ మరియాని కలిసాడు. ఆమెకు నెలలు నిండసాగాయి. పిదప దైవకుమారుడు జన్మించనున్నాడనే

శివకుమార్

శుభవార్త ముగ్గురు జ్ఞానులకు తెలిసింది. జ్ఞానులు వెళుతుంటే దేవుని వెలుగు వారికి ప్రభువు జన్మించబోయే పశువుల పాకకు దారి చూపించింది. పశువుల పాకలో ప్రజల పాప భారం మోయడానికి, పుడమి తల్లిని పునీతం చెయ్యడానికి కరుణామయుడు ఏసుక్రీస్తు మరియా కడుపు పంటగా ముద్దు ముఖంతో అవనిమీద జన్మించాడు.

ప్రభువు పుట్టిన వెంటనే ప్రకృతి పరవశించింది! అందరి హృదయాలూ ఆనందంతో గంతులువేసాయి! మరియా, జోసెఫ్‌ల ఆనందానికి అంతులేదు! జ్ఞానులు ముగ్గురూ తమ జన్మ ధన్యమైందని భావించారు!

ఏసును తీసుకుని మరియా, జోసెఫ్‌లు ఈజిప్ట్ చేరుకున్నారు. ఏసు ప్రేమసామ్రాజ్యం మొదలైంది. ప్రేమ అహింస సమధర్మం పునాదులుగా ఆ క్షమాహృదయుడు సరికొత్త సామ్రాజ్యం సృష్టించి రాజాధిరాజు అయ్యాడు.

ఎందరో రాజులు, రారాజులు, చక్రవర్తులు ఈ ధరణిని ఏలేవారు. కాలగర్భంలో కలసిపోయారు. కాని మకుటంలేని మహారాజు అయిన ఈ రాజాధిరాజు ఏసుక్రీస్తు సామ్రాజ్యం నాటినుండి నేటివరకూ, చిరస్థాయిగా ఉండిపోయింది. ఎందుకంటే, అది రక్తం ప్రవహింపచేసి కట్టుకున్న కోటకాదు! రక్తం చిందించి, ప్రజల పాపభారం మోసి, త్యాగం అన్న పవిత్ర పదానికి చిహ్నంగా నిలిచిన ఏకైక సామ్రాజ్యం!!

ప్రేమ, అహింస, సమధర్మం, త్యాగం ఇవి ఆచంద్ర తారార్కాలుగా నిలుస్తాయి అన్నదే క్రీస్తు ప్రభువు సందేశం.

*






కర్ణుడు లేని మహాభారతం లేదని ప్రతీతి.

కర్ణుడుకు ఉన్న శాపాలు బహుశా భారతంలో ఏ వీరుడికీ లేవు. తన ప్రాణాలకు అపద అని తెలిసినా, తన శరీరంలో అంతర్భాగాలైన తన సహజ కవచకుండలాలను, వచ్చినవాడు దేవేంద్రుడని తెలిసినా దానం చేసిన మహాదాత. తను కుంతీదేవి పుత్రుడు అని తెలిసినా ఆ సత్యం బయట పెట్టకుండా అర్జునుడిని తప్ప మిగతావారిని చంపనని తనకు అన్యాయం చేసిన కుంతికే అభయమిచ్చిన ధర్మమూర్తి. పంచపాండవులచేత, దాస్యం చేయిస్తాననీ, ద్రౌపదీదేవినే భార్యను చేస్తాననీ శ్రీకృష్ణుడు చెప్పినా ప్రలోభపడక తనకు కష్టకాలంలో అన్నం పెట్టిన దుర్యోధనుడికు కృతజ్ఞుడిగా ఉన్న పవిత్రమూర్తి. లోకం తననూ దుష్ట చతుష్టయంలో ఒకడిగా చేసినా చిరునవ్వుతో భరించిన కారుణ్యమూర్తి.

కురుక్షేత్ర యుద్ధంలో కర్ణార్జున యుద్ధం జరుగుతోంది. శల్యుడు కర్ణుడు సారథి. అడుగడుగునా కర్ణుడిని నిరుత్సాహపరుస్తున్నాడు. శ్రీకృష్ణపరమాత్మ అడుగడుగునా అర్జునుడిని ప్రోత్సాహపరుస్తున్నాడు. కర్ణుడు అయినా నిరుత్సాహపడడంలేదు. అవక్ర పరాక్రమంతో విజృంభిస్తున్నాడు. కర్ణుడి ధాటికి అర్జునుడు అంతటివాడు తట్టుకోలేక పోతున్నాడు.

కర్ణుడు అర్జునుడిని సంహరించాలని నిర్ణయించుకున్నాడు. నాగాస్త్రం సంధించాడు. అది ఖాండవదహనం కృష్ణార్జునులచేత జరిగినప్పుడు తప్పించుకున్న ఒకే ఒక పాము. అది పగతో అస్త్రంగా మారి కర్ణుడిని చేరింది. దాని శక్తికి తిరుగులేదు. అది ప్రయోగించాడు

కనకమహాలక్ష్మి



కర్ణుడు. శ్రీ కృష్ణపరమాత్మ అది గ్రహించారు. రథాన్ని భూమిలోకి త్రొక్కాడు. అర్జునుడు శిరస్సు ఖండించవలసిన నాగాస్త్రం దాంతో అర్జునుడి కిరీటాన్ని పడగొట్టింది. ఆ నాగరాజు తిరిగి కర్ణుడి వద్దకు వచ్చి "కర్ణా...నీవు ప్రయోగించిన నాగాస్త్రం శ్రీ కృష్ణుడు చేసిన మాయవల్ల విఫలం అయ్యింది. తిరిగి ప్రయోగించు" అని ప్రాథేయపడ్డాడు.

"ఒకసారి విఫలమైన అస్త్రం తిరిగి సంధించడం ధర్మం కాదు" అని తిరస్కరించి మామూలుగా యుద్ధం చేయడం మొదలు పెట్టాడు కర్ణుడు.

అ సమయంలో బ్రాహ్మణ శాపంవల్ల కర్ణుడి రథం భూమిలోనికి కృంగిపోయింది. సాయం చెయ్యవలసిన శల్యుడు నిర్దాక్షిణ్యంగా వదిలి వెళ్ళిపోయాడు. కృష్ణుని సూచన మేరకు రథ చక్రాలు ఎత్తి భూమిమీద పెట్టాలనే ప్రయత్నంలో పడ్డ కర్ణుడి మీదకు బాణాలు వెయ్యడం ఆపలేదు అర్జునుడు.

"అర్జునా! నేను రథంమీద లేను. విరథుడిని. నీవు రథివి. నా మీద బాణం వెయ్యడం ధర్మం కాదు" అని కర్ణుడు ధర్మాన్నే చెప్పాడు.

అయితే అర్జునుడు వినలేదు. కర్ణుడుమీద బాణాలు వెయ్యడం మొదలుపెట్టాడు.

అప్పుడు ప్రత్యక్షమైంది ధర్మదేవత. ఆమె అక్కడ ప్రత్యక్షమై అర్జునుడి బాణాలను పూలమాలలుగా మార్చివేస్తూ కర్ణుడి కంఠసీమను అలంకరించడం మొదలుపెట్టింది.

అది చూసి నరనారాయణులైన శ్రీ కృష్ణార్జునులు ఇద్దరూ నిర్ఘాంతపోయారు. శ్రీ కృష్ణపరమాత్మకు కోపం వచ్చింది. కర్ణుడిని చంపందే దుర్యోధనుడిని చంపడం ఎట్టి పరిస్థితిలో సాధ్యం కాదు. ధర్మదేవత వంక ఆగ్రహంగా చూస్తూ—"ఈ ధర్మయుద్ధం నేనే చేయిస్తున్నాను. కర్ణుడు చావాలి. నా ఆజ్ఞ ధిక్కరించటానికి నువ్వు ఎవరు?" అని ప్రశ్నించాడు.

"కృష్ణా ..నువ్వు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడివి. అయితే ధర్మం అతిక్రమించడానికి నువ్వు ఎవరు? ఈ కర్ణుడు ఎవరనుకున్నావు? మహాదాత! ఈ ధర్మదేవతకు ముద్దు బిడ్డ. అలాంటి నా ముద్దుబిడ్డను చంపడానికి భగవంతుడివైనా నీకు అధికారం లేదు!" అంది ధర్మదేవత.

శ్రీ కృష్ణపరమాత్మకు క్షణకాలం ఏం సమా

థానం చెప్పాలో అర్థంకాలేదు. ఆమె చెప్పింది ధర్మం. అది అతిక్రమించే అధికారం తనకు లేదు. అయితే జగన్నాటక సూత్రధారికి ఒకరు చెప్పాలా...?

బ్రాహ్మణుడి వేషం ధరించి కర్ణుడి వద్దకు వెళ్ళాడు. "కర్ణా! మహాదాతా! దానకర్ణా! నాకు దానం చెయ్యవా?" అని అర్థించాడు.

కర్ణుడు ఆశ్చర్యపోయాడు. ఒంటినిండా బాణాలు. తను చావడానికి సిద్ధంగా ఉన్నాడు. అలాంటి భయంకర పరిస్థితుల్లో తననించి ఆ సద్బ్రాహ్మణుడు ఏం దానం ఆశిస్తున్నాడు? అని ఆశ్చర్యపోతూ "మహాత్మా!...ఈ పరిస్థితుల్లో ఉన్న నేను తమవంటి పుణ్యాత్మునకు ఏం దానం ఇవ్వగలనో సెలవు ఇవ్వండి" అన్నాడు బలవంతంగా రెండు చేతులూ జోడిస్తూ.

"కర్ణా...నువ్వు దానం చేసి ఎంతో పుణ్యఫలాన్ని కూడకట్టుకున్నావు. అది దానం కావాలి?" అన్నాడు ఆ బ్రాహ్మణుడు.

కర్ణుడు ముఖం వికసించింది. "అంతేనా... నా శక్తికి మించింది అడుగుతారేమోనని కలవరపడ్డాను" అంటూ తన పుణ్యఫలాన్ని ఆ బ్రాహ్మణుడికి దానం చేశాడు.

కన్నీటితో అదృశ్యమైంది ధర్మదేవత. బాణం వెయ్యడానికి సిద్ధంగా ఉన్న అర్జునుడిని వారించి, కర్ణుడు ముందు శ్రీ మహావిష్ణువు రూపంలో దర్శనమిచ్చాడు పరమాత్మ! "కర్ణా...! సృష్టికే దాతనైన నాకే దానం ఇచ్చిన మహాదాతవి. ఆ చంద్ర తారార్కం దాన వీర శూర కర్ణుడిగా యుగాలు మారినా నిలిచిపోతావు. శాశ్వత కైవల్యం పొందుతావు" అని వర మిచ్చాడు.

ఆనందపారవశ్యంతో చేతులు జోడించాడు కర్ణుడు.

నాటి నుంచి నేటి వరకూ ఎవరైనా దానం ఇచ్చేవారిని 'దానకర్ణుడు' అని అనడం నానుడి అయిపోయింది.

*



బీర్బల్ కథలు:

# తెలివైన జవాబు!

ఒకరోజు రాత్రి అక్బర్ పాదుషా కొలువు చాలించ- బోతుండగా-



















మహాశయా ప్రశ్నలడుగండి!


బీర్బల్ గారూ - మిమ్మల్ని వంద సులభమైన ప్రశ్నలు అడుగమంటారా? - లేదా ఒక్క కష్టమైన ప్రశ్న అడుగమంటారా?


పాదుషా వారికి వంద ప్రశ్నలు వినే సమయం లేదు - ఏం చేయాలి?
అయ్యా కష్టమైన ఒక్క ప్రశ్నే అడగండి!


అలాగే - కోడి ముందు పుట్టిందా? - గుడ్డు ముందా? - చెప్పండి!


కోడే ముందు పుట్టింది!
ఎలా చెబుతున్నారో వివరంగా చెప్పండి!


తమరు ఒక్క ప్రశ్నే అడుగుతామని ముందుగానే ఒప్పుకున్నారు! మరిప్పుడు రెండో ప్రశ్న అడిగితే ఎలా చెప్పేది?
ఆ వచ్చిన దక్షిణాది పండితుడు బీర్బల్ తెలివి-తేటలను ఎంతగానో మెచ్చుకుని వెళ్ళిపోయాడు!

# సంపద లభించే మార్గం!

• ఒక సిపాయి ఎలా అయినా సులభంగా సంపద సంపాదించుకోవాలనే ఉద్దేశంతో అడవికి బయలు దేరాడు. ఆ సంపద తెచ్చుకోవడానికి వెంట డ్రమ్, తుపాకీ, బాగ్ పట్టుకు వెళ్ళాడు. అలా చాలా రోజులు నడిచి కీకారణ్యం చేరుకుని అలసిపోయి ఒక చెట్టుక్రింద విశ్రమించాడు.



• అప్పుడు వనదేవత అతని సంకల్పం గమనించి చిట్టిపిల్ల రూపంలో అతని డ్రమ్ మీదకి దూకింది. అది చూసి ఆశ్చర్యపోయాడు. ఆ చిట్టిపిల్ల అదృష్టానికి ప్రతిరూపంలా వుంది. ఆమె ఆ డ్రమ్‌లో చేరి విచిత్రమైన శబ్దాలు చెయ్యసాగింది.





• దాన్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు సిపాయి. ఆ చేతిమీద నృత్యం చెయ్యసాగింది చిట్టిపిల్ల. సిపాయి ముచ్చటపడుతూ - "నిన్ను నగరానికి తీసుకుపోయి ఆడిస్తాను. నాకు సంపద లభిస్తుంది" అన్నాడు. ఆ చిట్టిపిల్ల "నీకు కావలసింది సంపదేగా. నన్ను వదిలెయ్ నేను నీకు సంపద లభించే మార్గం చూపిస్తాను" అంది.

• చిట్టిపిల్ల మాటలు నమ్మి వదిలేసాడు సిపాయి. అది పరుగు పరుగున బయలుదేరింది. ఆ పరుగుకు ఆశ్చర్యపడుతూ సంపద మీద ఆశతో అనుసరించాడు. ఆ చిట్టిపిల్ల బాగా గుబురుగా పొదలతో నిండివున్న చెట్ల మధ్య నిలిచింది. చిట్టిపిల్ల ఏం చెబుతుందా అన్న ఆసక్తితో వున్నాడు సిపాయి.





* చిట్టిపిల్ల సిపాయిని చూసి నవ్వుతూ "ఈ చెట్లు చూసావుగా! వీటి మధ్య తవ్వు! ఆ తవ్వకం చెట్లుకు మరీ దగ్గరగా వద్దు. మరీ దూరంగా వద్దు. లోతుగా వద్దు. ఈ పని చెయ్యగలిగితే నీకు సంపద లభిస్తుంది'' అని అదృశ్యమైంది చిట్టిపిల్ల. అది కష్టమైన పని అయినా సంపద మీద ఆశతో కోటు విప్పి పని మొదలుపెట్టాడు సిపాయి.

* అలా తవ్వడంలో రోజులు గడిచాయి. అయితే సిపాయికి సంపద లభించలేదు. అయినా నమ్మకంతో అడవిలో దొరికించే తింటూ చిట్టిపిల్ల చెప్పిన చెట్లు మధ్య తవ్వకం పూర్తి చేసాడు. అప్పుడు ఆ చెట్లు అన్నీ ఫలాలతో నిండిపోయాయి. ఒక పండు తీసి తిన్నాడు సిపాయి. అది అమృతంలా వుంది.





* అప్పుడు సంపద విషయం మర్చిపోయి ఆ పళ్లను కోసి నగరంలో మార్కెట్‌కి తీసుకువెళ్ళాడు. ప్రజలంతా ఆ ఫలాలను విరగబడి కొనుక్కున్నారు. ఇంకా కావాలని కోరారు. మళ్ళీ అడవికి వెళ్ళి అన్ని ఫలాలు తెచ్చి అమ్మేసాడు. అతను సంపన్నుడు అయిపోయాడు.

* అడవిలోనే చక్కటి ఇల్లు కట్టుకుని సుఖంగా జీవించసాగాడు సిపాయి. అప్పుడు చిట్టిపిల్ల ప్రత్యక్షమై - "సులభంగా సంపద లభించదు. కష్టే ఫలి అన్నారు. నువ్వు కష్టపడ్డావు. అందుకే సంపద లభించింది'' అని చెప్పి అదృశ్యమైంది. సిపాయికి జ్ఞానోదయం అయింది.

రచన: ధరణీరాయ్ చౌదరి



# మా బుజ్జాయిల పుట్టినరోజు



కె. ఆశ్రిత (నాగేపల్లి)
పుట్టిన తేది: 20-12-1989
తల్లి పేరు: కె. గీతాలక్ష్మి
తండ్రి పేరు: కె. వెంకటేష్





ఎమ్. నిర్మల (కర్నూలు)
పుట్టిన తేది: 25-12- 1989
తల్లి పేరు: ఎమ్. పద్మావతి
తండ్రి పేరు: ఎమ్. కృష్ణమూర్తి







చెళ్ళా హారిత (విజయనగరం)
పుట్టిన తేది: 8-12-1988
తల్లి పేరు: చెళ్ళా పద్మజ
తండ్రి పేరు: చెళ్ళా ఉదయ భాస్కరరావు



ఎన్. శరత్ కుమార్ (మద్రాసు)
పుట్టిన తేది: 18-12-1989
తల్లి పేరు: ఎన్. జయశ్రీ
తండ్రి పేరు. ఆర్. నాగేంద్రన్



ఎల్. ప్రత్యూష (వనపర్తి)
పుట్టిన తేది: 10-12-1990
తల్లి పేరు: ఎల్. శ్రీలక్ష్మి
తండ్రి: ఎల్. సాయిప్రసాద్

ఎస్. సుధారాణి (రాజమండ్రి)
పుట్టిన తేది: 2-12-1980
తల్లి పేరు: ఎస్. లక్ష్మి
తండ్రి పేరు: ఎస్. అక్కిరాజా

వై. వెంకట శాలంగణేష్ (విశాఖపట్నం)
పుట్టిన తేది: 24-12-1990
తల్లి పేరు: వై. శాంతి
తండ్రి పేరు: వై. వెంకటేష్

కొవ్వలి ఆదిత్యశ్రీరామపవన్ కుమార్(ఏలూరు)
పుట్టిన తేది: 11-12- 1988
తల్లి పేరు: సుధ
తండ్రి పేరు: ఉమా నాగేశ్వరరావు

కె. మధురిమ (విజయవాడ)
పుట్టిన తేది: 2-12-1982
తల్లి పేరు: కె. విజయలక్ష్మి
తండ్రి పేరు: కె. రామకృష్ణ









# బుజ్జాయి విజ్ఞానం

నిర్వహణ: రోహిణీ కృష్ణ



**ఎన్. మారుతీరావు (గుడివాడ)**

పదమూడవ సంఖ్య దురదృష్టకరమైనదని అంటారు...నిజమేనంటారా?

* ఇది కేవలం మూఢ నమ్మకం మాత్రమే. ప్రపంచంలోని దాదాపు అన్ని దేశాలవారూ ఈ సంఖ్యను దురదృష్టకరమైనదిగా భావిస్తారు.

కొందరి మతములలో మనిషి లెక్కించడం మొదలు పెట్టినప్పటినుండి '13'కు ప్రాచుర్యం లేదు. తన చేతి పది వ్రేళ్ళను, కాలి రెండువ్రేళ్ళను కలిపి పన్నెండు వరకు లెక్కించేవాడు. ఆ పిదప లెక్కించలేక పోయేవాడు.

ధార్మిక మతానుసారం ఈ సంఖ్య గురించి ఓ మూఢ నమ్మకం వుంది. జీసస్ క్రీస్తు తన పన్నెండు మంది శిష్యులతో ఒకసారి భోజనం చేసాడు. ఇదే అతని ఆఖరి భోజనం అయింది. దీనిని క్రైస్తవులు 'ఆఖరి విందు' (Last Supper) అంటారు. అప్పట్నుంచి పదమూడు సంఖ్య చెడ్డదిగా భావించబడుతోంది. గ్రీకు పురాణంలో వల్‌హల్లా (Valhalla) విందును కూడా ఒక కథగా చెబుతారు. ఈ విందుకు పన్నెండు మంది దేవతలు ఆహ్వానింపబడ్డారు. భూతమువంటి వాడైన లోఖికి విందుకి పిలవకుండా హాజరయినాడు. దాంతో సంఖ్య పదమూడైంది. ఫలితంగా దేవతలకు ప్రియమైన బెల్డర్ (Belder) చంపబడ్డాడు. అప్పటినుంచి పదమూడు సంఖ్య చెడుగా భావించబడుతోంది.

ఏదేమైనా ఫలానా సంఖ్య అదృష్టకరమైనదీ, ఫలానా సంఖ్య దురదృష్టకరమైనదీ కాదు।

**డి. వివేక్ (ఏలూరు)**

పిష్టల్ అనే పేరు ఎందుకు వచ్చింది?

* జేబులో పెట్టుకునేందుకు వీలుగా వుండే చిన్నసైజు తుపాకీని 'పిష్టల్' అంటున్నాము. దీనిని ఇటలీకి చెందిన 'పిష్టోయా' అనే ఆయన కనుగొన్నాడు. ఆయన గౌరవార్థం పిష్టల్ అని వ్యవహరించబడుతోంది.



**డి. శ్యామ్యూల్ జోసెఫ్ (పలాస)**

డిశెంబర్-25 క్రిస్మస్ దినంగా ప్రపంచం అంతటా జరుగుతుందా?

* జరుగుతుంది. అయితే అమెరికన్ చర్చి మాత్రం జనవరి-6 న కేదీ క్రిస్మస్ (క్రీస్తు పుట్టినరోజు) దినంగా పండుగ జరుపుకుంటుంది.

# లిటిల్ డిటెక్టివ్





విశ్వాస్ స్కూలు నుండి వచ్చి కాళ్లు చేతులు శుభ్రం చేసుకుని హోం వర్క్ ముందేసుకుని కూర్చున్నాడు. విశ్వాస్ హోంవర్క్ చేసుకుంటూ వెళితే అది పూర్తి అయ్యేవరకు లేవడు. ఈలోగా వాళ్ళమ్మగారు హార్లిక్స్‌తో పాటు ఏదైనా టిఫిను తీసుకువచ్చి పెడుతుంది.

ఆ రోజు విశ్వాస్ హోంవర్క్ త్వరగా అయిపోయింది. అయినా అతనికి హార్లిక్స్ కాని టిఫిన్ కాని రాలేదు. ఇలా ఎప్పుడూ జరగలేదు. తను స్కూలు నుండి వచ్చేప్పుడు అమ్మ హాల్లో అదే వీధిలో వుండే రమా ఆంటీతో మాట్లాడుతూ వుండడం చూశాడు. వెళ్ళి చూస్తే ఇంకా వాళ్ళిద్దరూ మాట్లాడుతూనె వున్నారు చాలా సీరియస్‌గా.

''అమ్మా!'' అంటూ పిలిచాడు విశ్వాస్.

ఆమె తిరిగి చూచింది. ''నువ్వా! ఎంతసేపయింది వచ్చి?'' అంటూ లేచి ''ఒక్క నిమిషంలో వస్తా'' అని విశ్వాస్‌ని తీసికొని డైనింగ్ టేబిల్ వైపుకు వెళ్ళింది. అతనికి టిఫిన్ పెట్టి హార్లిక్స్ కలిపి ఇచ్చి తిరిగి వెంటనే హాల్లోకి వెళ్ళిపోయింది.

విశ్వాస్‌కి విచిత్రంగా తోచింది. అమ్మ ఎప్పుడూ ఎవరితోనూ ఇంతసేపు మాట్లాడదు.

వి. కె. మురళీకృష్ణ



''నాకూ ముందు నమ్మకం కలగలేదు. ఓసారి వెళ్ళి చూసివస్తే 'నష్టం ఏంలేదు' కదా అని నిన్న వెళ్ళాను. నా కళ్ళారా చూసాక కూడా ఎలా నమ్మకుండా వుండగలను. రేపు కూడా వెళ్లాలనుకుంటున్నాను'' అని చెప్పింది రమా ఆంటీ. ఈలోగా నాన్నగారు రావడంతో వారి మాటలకు అంతరాయం కలిగింది - రమా ఆంటీ వెళ్ళిపోయింది.

అమ్మ చకచకా కాఫీ కలిపి నాన్నగారికి ఇచ్చింది.

''ఏంటోయ్! ఎన్నడూ లేంది హస్కు వేసుకూర్చున్నావ్? ఏమిటీ విశేషం!'' అడిగారు నాన్నగారు.

''విశేషా ల్లేవు సశేషా ల్లేవు. ఎవరో స్వామీజీ వచ్చారు అని రమ చెపుతూంటే వింటున్నాను.''

విశ్వాస్ వాళ్ళ సంభాషణ వింటూ మెల్ల మెల్లగా హార్లిక్స్ తాగుతున్నాడు.

''ఏమిటా స్వామీజీ ప్రత్యేకత? మరీ పని గట్టుకుని వచ్చి చెపుతున్నది మీ ఫ్రెండు!'' అంటూ నాన్నగారు కొంచెం సాగదీసి అడిగే సరికి అమ్మకు ఉడుకుమోత్తనం వచ్చేసింది. అమ్మ అలిగిందంటే చచ్చి గీపెట్టినా కోపం తగ్గేవరకు ఎవరితోనూ మాట్లాడదు. ఆ విషయం నాన్నగారు పసిగట్టారేమో మళ్లీ మామూలుగా అడుగుతున్నట్టు ధోరణి మార్చి అడిగాడు.

నాన్నగారి ముఖంలోకి పరిశీలనగా చూసింది. అయన ముఖంలో హేళన చేసే ఛాయలు కనిపించకపోయేసరికి అమ్మ కోపం దిగిపోయింది. నాన్నగారు కాలేజీ రోజుల్లో పైగా నాన్నగారు వచ్చే టైమ్‌లో ఇంకా మాట్లాడుతూ కూర్చున్నదంటే ఏదో ముఖ్యమైన విషయమే అయివుంటుంది అనుకున్నాడు విశ్వాస్.

వాళ్ళిద్దరి సంభాషణలో కొన్ని పదాలు మాత్రం విశ్వాస్ చెవిన పడుతున్నాయి. వాటన్నిటినీ చేర్చి తన బుర్రకు పని కలిపించాడు. సారాంశం ఏంటంటే ఎవరో స్వామీజీ వచ్చారు. ఆయన మాట్లాడారు. దక్షిణలు కూడా స్వీకరించడు. కుటుంబంలో మంచీ, చెడూ ఏదైనా వుంటే చెపుతాడు వాటి నివారణ కూడా చేస్తాడు. చాలా మందికి మేలు కలిగింది అని రమా ఆంటీ చెపుతుంటే అమ్మ కళ్ళింత చేసుకుని ''నిజమా?'' అని అడిగింది.

నాటకాల్లో ఎన్నో ప్రయిజులు కొట్టిన సంగతి మరచిపోయింది. క్షణంలో ముఖంలో భావాలు మార్చడం నాన్నగారి ప్రత్యేకత!

"ఏం లేదండి! ఎవరో స్వామీజీ వచ్చేరట! ఆయన దగ్గర చాలా మహత్తు వుందని అందరూ అనుకుంటూవుంటే మన రమ కూడా నిన్న వెళ్ళి చూసి వచ్చిందట. రమ నమ్మిందంటే నిజంగా స్వామీజీ మహత్తు కలవాడే అయి వుండాలి. నేను కూడా రేపు రమతోపాటు వెళ్ళొస్తానండీ" అంటూ ముగించింది అమ్మ.

"నువ్వు వెళతానంటే నాకు ఏ అభ్యంతరమూ లేదు. కాని రమ చూసిన మహత్తు ఏమిటో, ఆమె ఎందుకు నమ్మిందో ఏమైనా చెప్పిందా?" నాన్నగారు మామూలుగా అడిగారు.

"ఆ విషయమేగా ఇంతసేపూ చెప్పింది. భక్తులు ఒక కొబ్బరి కాయ మాత్రం తీసుకు వెళితే చాలట! ఇంటిలోగాని ఇంట్లో వాళ్ళలో గాని ఏ దోషమూ లేకుండా వుంటే కొబ్బరి కాయ పగులగొడితే మామూలుగా అందులో నీళ్ళు తెల్లగా వుంటాయట! ఇంట్లో ఏదో శుభ కార్యం జరగబోతున్నది అంటే కొబ్బరి కాయలో నీళ్ళు పసుపు రంగులో మారతాయి. దోషం ఏదైనా వుంటే నిళ్ళు ఎర్రగా వుంటాయి. రమ తన కళ్లార చూసిందట" అంటూ నాన్న ఆశ్చర్యపోయేలా చెప్పింది.

నాన్నగారు మాత్రం "ఇవన్నీ ఏవో ట్రిక్కులు సుమా! లోన వున్న నీళ్ళ రంగు మారడం ఏమిటి? ఇందులో ఏదో మోసం వుంది!" మామూలుగా అన్నాడు.

"మోసం లేదు వేషం కాదు! పైగా ఆయన దక్షిణలు కూడా తీసుకోరట! ఇహ మోసం చేసే అవకాశం ఎక్కడుంది?!" లా పాయింట్ వేసింది అమ్మ.



"నీ ఇష్టం - ఒక కొబ్బరికాయ వల్ల మన కొచ్చే నష్టం ఏమీలేదు - వెళ్ళిరా!" అంటూ నాన్నగారు చెప్పులు వేసికొని డాబామీదకు వెళ్ళిపోయారు.

మరునాడు ఆదివారం. సాయంకాలం తెలుగు సినిమా టీ. వీ.లో వచ్చే టైం అయింది. మామూలుగా అయితే అమ్మ ఆ టైంకల్లా పనులన్నీ తెముల్చుకు వచ్చి టి. వి. ముందు కూర్చుంటుంది. ఆ రోజు మాత్రం బయటకు వెళ్ళేందుకు రెడీ అవుతున్నది. విశ్వాస్‌కి సడన్‌గా గుర్తుకు వచ్చింది, అమ్మ స్వామీజీ



దగ్గరకు వెళుతున్నదీ అని!

"నాన్నగారూ! నేనూ వెళ్ళనా? అంటూ గొంతు తగ్గించి అడిగాడు విశ్వాస్.

విశ్వాస్ వైపు సూటిగా చూసి "నువ్వు వస్తానంటే వద్దంటుందేమో... నువ్వు వేరుగా వెళ్ళు!" అని చెబుతూండగానె

"నేను వెళ్ళొస్తానండీ!" అంటూ అమ్మ పూలసెజ్జలో ఓ కొబ్బరికాయ, అరటి పళ్ళు అగరొత్తులు, కర్పూరం వగైరా పెట్టుకుని వెళ్లి పోయింది. వెళ్ళే దోవలోనే రమ ఆంటీ యిల్లు వుంటుంది.

పది నిమిషాల తరువాత విశ్వాస్ కూడా బయలుదేరాడు.

ఊరి బయట శక్తి గుడిలో స్వామీజీ వుంటున్నారు. అప్పటికే చాలా మంది ఆడ వాళ్ళు వచ్చి వున్నారు. తల్లికి కనిపించకుండా వెళ్ళి ఆడవాళ్ళ మధ్యన స్వామీజీకి దగ్గరలో కూర్చున్నాడు విశ్వాస్. అతని కళ్లు స్వామీజీని అతని శిష్యులను తీక్షణంగా గమనిస్తున్నాయి. స్వామీజీ వద్ద ఇద్దరు శిష్యులు ఉన్నారు.

ఒకతను భక్తులు ఇచ్చిన కొబ్బరికాయ లను గుళ్ళో అమ్మవారికి పూజ చేసేందుకు తీసుకువెళ్తున్నాడు. గుడి లోపల అంతా చీకటి ఏమీ కనిపించడంలేదు. అతను పూజ చేసిన కొబ్బరికాయలను బయటకు తీసుకువచ్చి స్వామీజీ పాదాల వద్ద పెడుతున్నాడు.

స్వామీజీ ఓ సారి శక్తిని తల్చుకుంటు న్నట్టుగా కళ్ళు మూసుకుని కొబ్బరికాయ చేత్తో పట్టుకుని ఒకే దెబ్బకి పగులకొడుతున్నాడు. అందులోంచి ఒలికే కొబ్బరి నీళ్ళ రంగును చూసి భక్తులకు వివరిస్తున్నాడు మరొకడు.

చాలా మందికి తెల్లనీరు. కొంతమందికి పసుపు నీరు వచ్చింది. వారందరికీ శుభమే జరుగుతుంది.

వచ్చిన వాళ్ళలో ఎనమండుగురికి మాత్రం ఎర్ర నీరు వచ్చింది. విశ్వాస్ వాళ్ళ అమ్మ గారికి కూడా ఎర్ర నీరు వచ్చింది.

ఎర్రనీరు వచ్చిన వారంతా ఆందోళనతో భయపడ్డారు. స్వామీజీ శిష్యుడు మాత్రం భయపడవలసిన పనిలేదని చెప్పి ఎర్రనీరు వచ్చిన ఎనమండుగురికి మరునాడు రమ్మని చెప్పి టైం కూడా చెప్పాడు. ఒకసారి ఒకరికి టైం చెప్పాక అదే టైం మరొకరికి చెప్పడం లేదు - మిగతా వాళ్ళకి అరగంట, ముప్పావు

గంట తేడాలతో టైం చెప్పాడు. ఎర్రనీళ్ళు వచ్చిన వాళ్ళంతా దిగులుగా వెళ్ళిపోయారు.

రాత్రి పన్నెండు కావస్తున్నది...అయినా విశ్వాస్‌కు నిదరపట్టడంలేదు. కొబ్బరికాయ లోకి రంగు నీళ్ళు ఎలా వస్తున్నాయి?

విశ్వాస్ దిగ్గున లేచి కూర్చున్నాడు. అతని బుర్రకు చప్పున ఏదో తట్టింది!!"

తెల్లవారు ఝామున నాన్నగారు లేచి జాగింగ్‌కి రెడీ అవుతూండడం చూచి - తన బుర్రకు తట్టిన రహస్యాన్ని చెప్పాడు. వెంటనే ఆయన పోలీసులకు ఫోన్ చేశాడు. స్వామీజీ అతని బృందం పట్టుబడింది. గుడిలో నుండి అస్పత్రిలో వాడే సిరెంజిలు, పసుపురంగు, ఎరుపు రంగు ద్రవాలు దొరికాయి.

విశ్వాస్ అమ్మగారు రెడీ అయి స్వామీజీ దగ్గరకు బయలుదేరబోతుంటే "మీ స్వామీజీని పోలీసులు పట్టుకున్నారు. అతను మోసగాడు. వాడి బండారాన్ని మన విశ్వాస్ బయట పెట్టాడు" అని చెప్పడంతో ఆమె ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయింది.

ఈలోగా విశ్వాస ఒక కొబ్బరికాయ తీసుకు వచ్చి "తల్లీ మీ ఇంట్లో దుష్టశక్తులు వున్నాయి చూసుకో" అంటూ కొబ్బరికాయ పగుల గొట్టాడు. అందులో నుండి ఎర్రని ద్రవం బయటకు వచ్చింది. ఆమె ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయింది.

"ఇందులో ఆశ్చర్యపడాల్సింది ఏమీలేదు! ఇలాంటి మోసగాళ్ళు మన బలహీనతలను అడ్డం పెట్టుకుని పబ్బం గడుపుకుంటూ వుంటారు. సిరెంజితో కొబ్బరికాయ కన్నం గుండా రంగునీళ్ళు లోపలికి పంపిస్తాడు. ఆ మరునాడు రమ్మని చెప్పి శాంతి చెయ్యాలని డబ్బు లాగుతాడు. ఇలా వీడు చాలా ఊళ్ళలో చాలా మందిని మోసం చేశాడట. ఇప్పుడే ఇనస్పెక్టర్ ఫోన్ చేసి చెప్పాడు!" అని పూర్తి చేయడంతో ఆమె అలాగే సోఫాలో కూలబడి పోయింది తన మందబుద్ధికి విచారిస్తూ. *





# ధర్మరక్షణ

అవి ద్వాపర యుగం ముగుస్తున్న రోజులు. కురుక్షేత్ర సంగ్రామం ముగిసింది. కౌరవు లంతా నశించారు. పాండవులు స్వర్గం చేరి పోయారు. శ్రీకృష్ణపరమాత్మ ఉండడంవల్ల ద్వారక సుభిక్షంగా ఉంది. యాదవు లందరికీ గర్వం పెరిగిపోయింది. వారు కొందరు మునీశ్వరులు వస్తుంటే ఒక మగవాడికి స్త్రీ వేషం వేసి గర్భం ధరించినట్లు ఆకృతి సృష్టించి వారి దగ్గరకు తీసుకువెళ్ళి - "మునీశ్వరులారా... ఈ స్త్రీకి మగబిడ్డ పుడతాడా, ఆడబిడ్డ పుడుతుందా?" అని ప్రశ్నించారు.

అందులో ఒక ముని వారి అహంభావం గుర్తించి బుద్ధి చెప్పాలనుకుని నిర్ణయించుకుని "మూర్ఖులారా! వీడికి ముసలం పుడుతుంది. ఆ ముసలం మీ యాదవ కులాన్ని నాశనం చేస్తుంది!" అని శపించాడు.

వాడి కడుపున రోకలి పుట్టింది. వాడు చచ్చి పోయాడు. యాదవు లంతా కంగారు పడి పోతూ మహారాజు అయిన బలరాముడి వద్దకు వెళ్ళి జరిగిన విషయమంతా వివరించారు. బలరాముడు ఆ ముసలాన్ని అరగదీసి సముద్రంలో కలిపివెయ్యమని ఆజ్ఞాపించాడు.

అలా అరగదీస్తూ వారిలో వారికి కలహాలు పుట్టి యుద్ధం చేసి యాదవు లంతా చని పోయారు. రోకలి అరిగిపోయి చిన్న ఈటెగా మిగిలింది.

ఆ విషయం తెలిసిన బలరాముడు ఏం చెయ్యాలో తెలియక శ్రీకృష్ణుడిని పిలిచి "శ్రీకృష్ణా! ఇప్పుడు ఏం చెయ్యాలి?" అని అడిగాడు.

శ్రీకృష్ణుడు చిరునవ్వుతో "అన్నయ్యా! మనం వచ్చిన పని అయిపోయింది. నువ్వు

జంధ్యాల సత్యనారాయణ

వైకుంఠం వెళ్ళిపో'' అన్నాడు.

''మరి నువ్వు...?'' అడిగాడు బలరాముడు ఆశ్చర్యంగా.

''నాకు ఒకే ఒక కర్తవ్యం మిగిలి వుంది అన్నయ్యా! అది పూర్తిచేసి నేను వస్తాను'' అని చెప్పాడు శ్రీకృష్ణుడు.

బలరాముడు 'సరే'నని నాగరాజుగా మారి పోయి వైకుంఠం వెళ్ళిపోయాడు. శ్రీకృష్ణపర మాత్మ ఒక తోటలో కాలుమీద కాలువేసి తన కాలి బొటనవ్రేలు ఆడిస్తూ వేచి ఉన్నాడు.

ఒక వేటగాడు సముద్రపు ఒడ్డున నడిచి వస్తుంటే అరిగిపోయి ఈటెగా మిగిలిన ముసలం కనబడింది. మంచి ఈటె దొరికింది అనే ఉత్సాహంతో అది తన అమ్ములపొదిలో పెట్టుకుని వేటకు బయలుదేరాడు. అతనికి తోటలో ఉన్న కృష్ణుడి కాలి వ్రేలు కదులుతున్న పక్షిలా కనబడింది. వెంటనే బాణం వేశాడు. అది పరమాత్మకు గ్రుచ్చుకుంది. పక్షి చిక్కింది అనే ఉత్సాహంతో అక్కడకు వెళ్ళిన అతను పరమాత్మను చూసి నిర్ఘాంతపోయాడు.

వెక్కి వెక్కి ఏడుస్తూ ''పరమాత్మా...! నేనెంత పాపాత్ముడిని! శ్రీమన్నారాయణుడి అవతారమైన నిన్ను బాణంతో కొట్టానా!!'' అంటూ ఆయన పాదాలమీద పడ్డాడు.

శ్రీకృష్ణుడు చిరునవ్వుతో - లేదు నాయనా! ఏడవకు! నేను నీ గురించే వేచిచూస్తున్నాను'' అన్నాడు.

''నా గురించా? ఎందుకు స్వామీ?'' అడిగాడు వేటగాడు.

''పూర్వజన్మలో నువ్వు వాలివి. నిన్ను ఎదురుగా ఎవరూ జయించలేరు. మృగయా వినోదం క్షత్రియ కులధర్మం అనే నెపంతో శ్రీరాముడిగా చాటునుంచి నేను సంహరించాను. ధర్మాన్ని రక్షించాల్సిన బాధ్యత నాది. అలా ధర్మాన్ని రక్షించడం కోసం అధర్మంగా నిన్ను చంపాను, కనుక ఈ అవతారంలో నీ చేతే చనిపోవాలని నిర్ణయించుకున్నాను. అందువల్ల ఈ పాపం నిన్ను అంటదు. రామావతారంలో నాగరాజు నాకు తమ్ముడు లక్ష్మణుడిగా పుట్టి సేవలు చేశాడు. అందుకే కృష్ణావతారంలో నాగరాజు బలరాముడిగా జన్మిస్తే తమ్ముడిగా నేను పుట్టి సేవలు చేశాను'' అని వివరించాడు పరమాత్మ.

ఆ వేటగాడు పరమాత్మలో ఐక్యమయ్యాడు. శ్రీకృష్ణ నిర్యాణంతో ద్వాపర యుగం ముగిసింది. ✱





# వావర్ స్వామి

పందళరాజ్య అడవుల్లో వావర్ అనే గజదొంగ నివసించేవాడు. వ్యక్తిగతంగా అయన పరమ పుణ్యాత్ముడు. అయితే బ్రతకడానికి వేరే దారి లేకపోవడంతో ఆయన ఆకారం చూసి అందరూ భయపడడంతో దొంగగా మారి పోయాడు. అయితే పూర్వజన్మ పుణ్యంవల్ల పులిపాలకోసం అడవికి వచ్చిన అయ్యప్ప స్వామి దర్శనం లభించింది. వావర్ స్వామి అయ్యప్ప స్వామి ముందు భయంకరంగా నిలిచాడు. అయితే అపూర్వ తేజస్సుతో మెరిసి పోతున్న ఆ బాలుడిని చూడగానే అప్రయత్నంగా చేతులు ఎత్తి నమస్కరించేసాడు.

''దొంగతనాలు బాగా జరుగుతున్నాయా వావరూ!'' అని ఆప్యాయంగా పలకరించాడు హరిహర పుత్రుడు.

ఆ మాటలు వావరుస్వామి మీద మంత్రంలా పని చేసాయి.

''స్వామీ...మీరు...'' అన్నాడు వావరు ఆశ్చర్యంగా.

'నేను'...'నువ్వు'...ఏది నీది? ఏది నాది? నువ్వూ నేనూ వేరు అంటావా? ఒకరికి అన్నం పెట్టడంలో వున్న ఆనందం తీసెయ్యడంలో వుందంటావా? నీకు కావలసింది రత్నాల రాశులేగా! తీసుకో! ఎన్ని కావాలి? అడిగాడు అయ్యప్పస్వామి.

అంతే...ఆకాశంలోంచి రత్నాలరాశి వావర్ స్వామికి అభిషేకం చేసింది. వావరు నిర్ఘాంత పోయాడు!

అయ్యప్ప చిరునవ్వుతో ''తిను వావరూ ఆ రత్నాలు తిను!'' అన్నాడు.

వావరు అయ్యప్పస్వామితో ''స్వామీ! నన్ను క్షమించండి!'' అన్నాడు.

శివకుమార్

"నువ్వు పరమాత్ముడివి వావరూ! అందుకే నీకు నా అనుగ్రహం లభించింది. ఈ జన్మలో నువ్వు చేసిన పాపాలన్నీ క్షాళితమైపోయాయి. నువ్వంటే భయపడుతున్నారనే భావనతో ప్రజలపట్ల ద్వేషం పెంచుకున్నావు. ఇకనుంచీ నిన్ను చూసి ప్రజలు భయపడరు. భక్తితో ముందు నీ మసీదుకు వచ్చి నిన్ను దర్శించి నీ అనుమతితోనే నన్ను దర్శిస్తారు" అన్నాడు అయ్యప్ప చిరునవ్వుతో.

"స్వామీ! నా మతం...?" అన్నాడు వావరు తను ముస్లిమనని గుర్తుచేస్తూ సందేహంగా.

"'మతం' అంటే ఏమిటి వావరూ? అందరికీ సమ్మతమైనది. అంతే తప్ప మతం పేరిట మనిషినీ, మనిషినీ వేరుచేసేది కాదు. బాల్య యౌవన కౌమార వృద్ధాప్య దశలు అన్ని మతాల వారికీ ఒకేలాగే వస్తాయి. మట్టిలో పుట్టినవి మట్టిలోనే కలసిపోతాయి. మరెందుకు ఈ మతభేదాలు. అన్ని మతాలలోకీ గొప్పది మానవత్వం. ఎందుకంటే అదే దైవత్వం. నాకు కుల మత భేదాలు లేవు. హెచ్చు తగ్గులు లేవు. ఎవరైనా సరే నా దర్శనానికి ఒకేలా రావాలి. ఆస్తి అంతస్తులకు నా దర్శనంలో వ్యత్యాసం వుండదు. మతం అన్నావు కనుక హిందూ ముస్లింల సమైక్యతకు చిహ్నంగా శబరిగిరి మీద నిలుస్తాను. నీ స్థావరం 'ఎరుమేలి' అవుతుంది" అన్నాడు అయ్యప్ప.

వావర్‌స్వామి తన్మయత్వంగా వినసాగాడు.

అంతలోనే స్వామి "వావరూ! మతం అని సందేహపడ్డావు కనుక ముందు దర్శనంలో అగ్రతాంబూలం నీకే ఇస్తున్నాను. త్యాగంలో వున్న ఆనందం స్వార్థంలో లేదని చెప్పడమే నా కారణావతారం" అని చెప్పారు అయ్యప్ప స్వామి.

వావరుస్వామి తన జన్మ ధన్యమైంది అనుకున్నాడు. వావరుస్వామి వెలిసిన స్థావరం 'ఎరుమేలి' అయింది. పందళరాజు రాజశేఖర పాండ్యుడు అక్కడ వావర్‌స్వామికి చక్కటి మసీదు నిర్మించాడు.

అయ్యప్ప స్వామిని దర్శించే కోటానుకోట్ల భక్త జనబృందం ముందు మసీదుకు వెళ్ళి వావర్‌స్వామిని దర్శించి ఆయన ఆశీస్సులు అందుకునే అయ్యప్పస్వామి దర్శనం చేసుకుంటారు. *





# తీయని తిరస్కారం

వివేకానందుని శిష్యులు ఒకసారి అయనతో,

"స్వామీ! సన్యాసి ఎవరి దగ్గర నుండీ ఏమీ తీసుకోకూడదు కదా! మరి ప్రీతితో ఎదుటి వారు ఇచ్చినపుడు కాదనడం కూడా పద్ధతి కాదు కదా! అటువంటి పరిస్థితిలో ఏమి చేయాలి?" అన్నారు.

దానికి వివేకానందుడు ఏమీ చెప్పకుండా మౌనంగా వుండిపోయాడు.

కొంతకాలం గడిచింది. లాహొరులో పర్యటిస్తూ వివేకానందుడు, తన శిష్యులతో కలిసి తత్త్వవేత్త అయిన రామతీర్థ స్వామి ఇంట బస చేశాడు. రామతీర్థ స్వామి వివేకానందునికి చక్కని ఆతిథ్య మిచ్చాడు.

భోజనానంతరం వివేకానందుడు తన సహజ కోమల గాత్రంతో గానం చేసిన 'జహా రామ్ తహాఁ కామ్ నహీఁ; జహాఁ కామ్ తహాఁ నహీ రామ్' అనే హిందీ గీతం విని పరవశించిపోయాడు.

తరువాత రామతీర్థ స్వామి అయనకు జేబుకు ధరించే ఒక బంగారు గడియారాన్ని బహూకరించాడు. శిష్యులంతా వివేకానందుడు ఏమంటాడా అని చూశారు. వివేకానందుడు చిరునవ్వుతో దానిని స్వీకరించి, తిరిగి రామతీర్థ స్వామి జేబులో వుంచి, "నేను నా గడియారాన్ని మీ జేబులో దాచుకుందుకు మీకు అభ్యంతరమా?" అన్నాడు నవ్వుతూ!

"సన్యాసులకు బహుమానాలు ఇవ్వడం సంప్రదాయం కాదని తెలిసినా, నేను ఆ బహుమతిని ఇవ్వడానికి కారణం నాకు మీపై ఏర్పడ్డ నిర్హేతుక అనురాగమే" నంటూ వివేకానందుని చమత్కారానికి సంతసించాడు రామతీర్థ స్వామి.

వివేకానంద కథలు : వక్కలంక 'కిషోర్'

లాహోరు నుంచి వస్తూ వివేకానందుడు తన శిష్యులతో, "నాయనలారా! సాధారణంగా సన్న్యాసులకు విలువైన వస్తువు లెవరూ ఇవ్వరు. ఇచ్చారూ అంటే అపార అభిమానంతో ఆ పని చేశారన్న మాట! అలాంటి వస్తువును వారిని నొప్పించకుండా తిరస్కరించడం మన విధి" అన్నాడు.

శిష్యులంతా వివేకానందుని సద్యఃస్ఫూర్తికి సంతసించారు. *

# పొట్టి శ్రీరాములు



**1947** సంవత్సరం ఆగస్ట్ 15 న భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించాక ఆంధ్రరాష్ట్రంకోసం ఆంధ్రులు ఎంతో ఆశగా ఎదురు చూసారు. అప్పుడు ఆంధ్రదేశం మద్రాసు రాష్ట్రంలోనే ఉండేది.

స్వతంత్రం వచ్చి ఆరు సంవత్సరాలు గడిచినా ఆంధ్రరాష్ట్రం రాలేదు. వాగ్దానాలు కమిటీలు కమిషన్లు తప్ప ఆంధ్రుల అంత రంగాలు పట్టించుకోలేదు.

ఆంధ్రులలో అసంతృప్తి తారాస్థాయికి చేరుకుంది. పొట్టి శ్రీరాములుగారు ఆంధ్రరాష్ట్రంకోసం 1952 అక్టోబర్ 19 న మహాత్మ గాంధీ అడుగుజాడలలో ఆ మరణ నిరాహారదీక్షను పూనుకున్నారు. అయినా కేంద్రం చలించలేదు. ఆయన పట్టుదల పెరిగిపోయి ఏభైఆరు రోజులుపాటు నిరవధిక నిరాహారదీక్ష చేసి డిశంబరు 16 న అమరులయ్యారు.

ఆయన ఆత్మార్పణం ఆంధ్రులను వీరావేశంతో ముంచెత్తింది. ప్రభుత్వం స్తంభింపచేసారు. పోలీసుల తుపాకులు లెక్క చెయ్యక పదకొండుమంది ఆంధ్రులు తమ ప్రాణాలు ధారపోసారు. ఈ ప్రజాందోళన ఫలితంగా ప్రత్యేకాంధ్రరాష్ట్రాన్ని ఏర్పరుస్తూ ప్రధాని నెహ్రూ డిశంబర్ 19 న ప్రకటించారు.

1952 లో డిశంబర్‌లో కర్నూలు రాజధానిగా ఏర్పడిన ఆంధ్రరాష్ట్రం విశాలాంధ్రగా అంటే ఆంధ్ర రాయలసీమ తెలంగాణా ఏకంచేసి 1956 నవంబర్ 1 న ఏర్పడింది.

ఆంధ్రదేశం కోసం పొట్టి శ్రీరాములుగారి త్యాగం ఎవరూ ఎప్పటికీ మర్చిపోలేరు.

— వాద్రేవు పార్వతీదేవి



# తపస్సు

వల్మీకపురంల జీమకేతుడు అనె మహర్షి ఉండేవాడు. ఆ య న కు బ్రహ్మదెవుడు గురించి తపస్సు చెయ్యాలనే సంకల్పం కలిగింది. వెంటనే పద్మాసనం వేసుకుని బ్రహ్మ గురించి తపస్సు మొదలుపెట్టాడు. సంవత్సరాలు గడిచాయి. బ్రహ్మ సాక్షాత్కారం కలగ లేదు.

జీమకేతుడుకు కోపం వచ్చింది. బ్రహ్మ దేవుడు కఠినాత్ముడు అనుకున్నాడు. వెంటనే ఓ ఆలోచన వచ్చింది. పరమేశ్వరుడు భోళా శంకరుడు. భక్తవశంకరుడు! సులభసాధ్యుడు! భస్మాసురుడికి వరం ఇచ్చి తనకే ఆపద తెచ్చుకున్న కరుణాహృదయుడు! ఆయనకు దేవదానవ పక్షపాతం లేదు! ఉబ్బు లింగడు! అలాంటి శివుడి గురించి తపస్సు చేయకుండా బ్రహ్మ గురించి ఎందుకు తపస్సు చేశానా అని జీమకేతుడు బాధపడి శీర్షాసనం వేసి తల క్రిందులుగా పరమేశ్వరుడు గురించి తపస్సు మొదలుపెట్టాడు.

చాలా సంవత్సరాలు గడిచాయి. జీమకేతుడు తపస్సు కఠినంగా సాగింది. అయితే పరమేశ్వరుడు మాత్రం అతనికి ప్రత్యక్షం కావడంలేదు. శివుడు తను అంత దీక్షగా తపస్సు చేస్తున్నా ఎందుకు జాలిపడటం లేదో జీమకేతుడుకు అర్థం కాలేదు. శివుడిమీదకు కోపం వచ్చింది. శ్రీమహావిష్ణువు జ్ఞాపక మొచ్చాడు.

బ్రహ్మ కంటే, శివుడి కంటే విష్ణువే అన్ని విధాలా గొప్పవాడు అనిపించాడు! ఎందుకంటే గజేంద్రుని రక్షించడంలో విష్ణువు తన్ను తాను మర్చిపోయాడు. ఆయుధాన్ని కూడా ధరించకుండా వైకుంఠం వదలి బయలుదేరాడు. ఆయన వెంటనే సుదర్శన

వి. ఎస్. రామచంద్రన్

చక్రం....శంఖం....గదాయుధం బయలు దేరాయి.

అలాంటి దయామయుడైన మహావిష్ణువు గురించి తపస్సు చెయ్యకుండా అనవసరంగా బ్రహ్మ, శివుల గురించి తపస్సు చేసి విలువైన సంవత్సరాలు వృథా చేశానని అనిపించి అగ్నిలో నిలబడి మహావిష్ణువు గురించి భయంకర తపస్సు ఉగ్రంగా చెయ్యడం మొదలు పెట్టాడు జీమకేతుడు.

అయితే పాపం ఎంత కాలం తపస్సు చేసినా జీమకేతుడికి విష్ణువు దర్శనం కాలేదు. విష్ణువుమీద కోపం వచ్చింది.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ తనని కనికరించలేదు.

ఇంక ఎవరి గురించి తపస్సు చెయ్యాలో జీమకేతుడుకు అర్థం కాలేదు. తనమీద తనకే జాలి వేసింది. అసహ్యం వేసింది. వారి దర్శనం కాని తాను బ్రతకడం అనవసరం అనుకున్నాడు. తాను పరమ పాపాత్ముడు అని భావించాడు. తనవంటి పాపాత్ముడు బ్రతకడం భూమికి భారం అని భావించి కత్తి తీసుకుని తన కంఠం నరుక్కోవాలని నిర్ణయించుకున్నాడు.

అంతే! అతని ముందు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ ప్రత్యక్షమయ్యారు. జీమకేతుడు ఆశ్చర్యానందాలతో తలమునకలవుతూ వారికి సాష్టాంగపడి ''త్రిమూర్తులారా! నేను మనసావాచా తపస్సు చేస్తే కనికరించని మీరు ఆత్మార్పణ చేసుకుంటుంటే ఎందుకు ప్రత్యక్షమయ్యారు?'' అని అడిగాడు.

వారు అతనివంక వాత్సల్యంగా చూస్తూ ''నీలో ఇంతకాలం అహంకారం, అసహనం, కోపం వంటి మేఘాలు ఆవరించి వుండడం వల్ల మా కృపాకిరణాలు నీపై ప్రసరించడం కుదరలేదు. నేడు నీలో ఆ మేఘాలు తొలగిపోయాయి. అందుకే నీకు మేం ముగ్గురం ప్రత్యక్షమయ్యాము. ప్రతి వ్యక్తికీ పట్టుదలా, కృషీ వుంటే సరిపోదు! ఓర్పుకూడా కావాలి!'' అంటూ వివరించి మోక్షాన్ని ప్రసాదించారు.



# మంచి అవయవాలు

పూర్వం అరబ్ దేశంలో బానిసలను అమ్మే ఆచారం ఉండేది. ధనికులు తమ వద్ద బానిసలను ఉంచుకునేవారు. పేద కుటుంబంలో పుట్టినవాళ్ళు అలా బానిసలుగా అమ్మబడుతుండేవారు.

అలాంటి కాలంలో 'లుకమాన్' అనే బీద కుర్రాడు ఒక ధనికుని వద్ద బానిసగా ఉండేవాడు. అతడు ఒళ్ళు దాచుకోకుండా యజమానికి సేవలు చేసేవాడు. లుకమాన్ తెలివితేటలు, సేవాభావం చూసి యజమాని సంతోషించేవాడు. ఒకనాడు యజమాని లుకమాన్‌ని పిలిచి ఇలా అన్నాడు :

''ఒక మేకను కోసి దాని శరీరంలోని మంచి అవయవాలు తీసుకురా!''

లుకమాన్ ఒక మేకను కోసి, దాని గుండెకాయ, నాలుక పట్టుకెళ్ళి యజమానికి చూపించాడు.

ఈ సారి యజమాని ఇలా అన్నాడు :

''మరో మేకను కోసి దాని శరీరంలోని చెడు అవయవాలను పట్టుకుని రా!''

లుకమాన్ మరొక మేకను కోసి, మళ్ళీ గుండె, నాలుక తీసుకెళ్ళి యజమానికి చూపించాడు.

అది చూసి ఆశ్చర్యపడిన యజమానికి లుకమాన్ ఇలా చెప్పాడు :

''శరీరంలో మంచి అవయవాలు, చెడు అవయవాలు కూడా అవే! ఎందుకంటే, హృదయం శుచిగా ఉంటే నాలుక పరిశుభ్రంగా ఉంటుంది. అప్పుడు శరీరంలో అవే మంచి అవయవాలు. హృదయంపరిశుభ్రంగా లేకపోతే నాలుక అసత్యం మాట్లాడుతుంది. అపుడు అవే చెడు అవయవాలవుతాయి!''

లుకమాన్ మాటలకు యజమాని ముగ్ధుడై, ఆ రోజునుంచే అతడిని బానిసత్వం నుంచి విముక్తుని కలిగించాడు..

అటు పిమ్మట అతి తక్కువ కాలంలో లుకమాన్ శాస్త్రాలు చదివి మంచి పండితుడిగా పేరు గాంచాడు. అతడి కీర్తి దేశ దేశాలకూ వ్యాపించింది.

— కోనే శ్రీధరరావు





# స్తుతి-నింద

వేదగిరి జమీందారు సత్యాకరుడు మంచి సాహితీ ప్రియుడు. ప్రతిభ గల వారిని గుర్తించి వారిని ఘనంగా సత్కరించడం ఆయన అభిరుచి.

ఆ విషయం తెలిసిన చంద్రస్వామి అనే కవి సత్యాకరుని దర్శనం చేసుకున్నాడు. తన పాండిత్యాన్ని ప్రదర్శించి, సత్యాకరునితో మంచి బహుమతి ఏదైనా పొందాలని ఆయన ఉద్దేశ్యం.

చంద్రస్వామి సత్యాకరునికి తన గురించి చెప్పుకుని ఆయన మీద రెండు పద్యాలు చదివాడు. వాటి అర్థం యిది:

''ఓ ప్రభూ! మీరు అమేయ రత్నరాశులను గర్భంలో యిముడ్చుకున్న సముద్రంలాంటి వారు! మీ మనస్సు క్షణకాలం పరిమళించే మల్లెపూలకన్నా, చాలాసేపు గుభాళించే రమణు లెందరో మెచ్చుకుని మక్కువతో స్వీకరించే మొగలిపూల వంటిది!''

ఆ పద్యాలు చక్కని శబ్దాలంకారాలతో కూడుకుని, రమ్యంగా వున్నప్పటికీ, సత్యాకరునికి పొగడ్తలంటే గిట్టదు. ఎదుటి వ్యక్తిని భట్రాజులా పొగిడి, తమ పబ్బం గడుపుకునే వాళ్ళు కుత్సితులని అతని అభిప్రాయం. అందుకే అలాంటి వాళ్ళంటే అసలు గిట్టదు. అందుకని ఆయన చంద్రస్వామి వంక కోపంగా చూస్తూ ''నాకు పొగడ్త లంటే గిట్టదు. నాల్గు స్తుతి పద్యాలు చదివి, నన్ను ఆకాశానికి ఎత్తి, నా నుంచి ఎక్కువ మొత్తంలో బహుమానం కాజెయ్యాలన్న నీ ఎత్తుగడ నా కర్థం అయ్యింది. వెంటనే బయటకు వెళ్ళు!'' అన్నాడు.

దాంతో సభలో వాళ్ళంతా దిమ్మెర

దాసరి వెంకటరమణ

పోయారు. చంద్రస్వామి నీరుగారిపోతూ, "ప్రభూ! క్షమించండి! నేను యెన్నో దేశాలు సంచరించిన వాణ్ణి. చక్కని అర్థ చమత్కృతి గల పద్యాలను యెంత సమర్థవంతంగా చెప్పినప్పటికీ, నా కవిత్వాన్ని ఆదరించే కళాపోషకు లెవరూ కన్పించలేదు. అందుకే నా కవిత్వంలో ఈ విధంగా ఎదుటి వ్యక్తిని పొగడటం అలవాటు చేసుకున్నాను. మీరు అనుజ్ఞ యిచ్చినట్లైతే మీకు చక్కని కవిత్వం విన్పించగలను" అన్నాడు.

సత్యాకరుడు అతని వంక ఏవగింపుగా చూసి "అవసరం లేదు. నా కిపుడు కవిత్వం వినే ఓపిక లేదు. నువ్విక వెళ్ళు" అని అతనిని బయటకు పంపవలసినదిగా భటులకు ఆదేశించాడు.

చంద్రస్వామి ఎంత బ్రతిమాలినా లాభం లేకపోయింది. భటులు అతనిని లాక్కుపోతుండగా, మరో రెండు పద్యాలు చదివాడు. వాటి అర్థం యిది:

"ఓ ప్రభూ! మీరు నిజంగా సముద్రం లాంటి వారూ, మొగలిపూల వంటి వారే!... సముద్రుడు తనలోని సంపద చూసుకుని మిడిసిపడుతూ గర్వంగా పెద్దగా ఘోష పెడుతుంటాడు. అంతేగాక తన దగ్గరికి వచ్చిన వారి కాళ్ళక్రింది ఇసుకను తొలగించి తనలోకి లాక్కొని కబళించడానికి ప్రయత్నిస్తాడు! ఇక మొగలిపూలంటారా? ఎంత పరిమళం వున్నా అవి దైవపూజకు నోచుకోనివి. అంతే కాక అవి భయంకర విషనాగులకు నిలయాలు!"

అవి చదివి చంద్రస్వామి భటులతో పాటు వేగంగా బయటకు వెళ్ళిపోయాడు.

అతని పాండిత్యానికి, సమయస్ఫూర్తికి సత్యాకరుడు పరవశించిపోయాడు. కబురు పెట్టి చంద్రస్వామిని తిరిగి పిలిపించి ఘనంగా సత్కరించి పంపాడు.







# శాశ్వత కీర్తి

కోసలదేశం రాజు శ్యామలవర్మకు ఒక రోజు అనుకోకుండా ఒక అనుమానం వచ్చింది. తనిప్పుడు రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు కాబట్టి ప్రజలంతా తన నిప్పుడు తరచుగా తలచుకుంటూ ఉంటారు. కాని రేపు తను మరణించాక ఈ ప్రజలు తనను చాలా త్వరగా మరిచిపోతారు కదా? ఈ ఆలోచన రావడంతో రాజుకు చాలా బాధ కలిగింది.

ప్రజలు మనసుల్లో నుండి త్వరగా తొలగిపోవడం ఆయన కిష్టం లేకపోయింది. జనం మనసుల్లో చిరకాలం ఉండిపోవాలని ఆయన కనిపించింది. వెంటనే తన అంతరంగిక సలహాదారు శమీకుడిని పిలిచి తన మనసులోని మాట చెప్పి, అందుకు తగు సలహా ఇవ్వమని కోరాడు.

శమీకుడు కాసేపు ఆలోచించి "మహారాజా! తమ ఎదురుగా కనిపించే వ్యక్తి గురించి జనం తలచుకుంటూ ఉంటారు కాబట్టి మీరు మరణించినా జనం ఎదురుగా మీరు ఉండిపోవాలంటే వీధికో శిలావిగ్రహం నాటించండి" అని సలహా ఇచ్చాడు.

శ్యామలవర్మకు ఆ సలహా నచ్చింది. ఆయన వెంటనే శిల్పులను పిలిచి రాజ్యంలో తన శిలావిగ్రహాలు విరివిగా ఉండేలా ఏర్పాటు చేయించాడు.

ఇది జరుగుతున్న సమయంలోనే కోసల రాజ్యంలోనికి ప్రబంధుడు అనే సాధువు వచ్చాడు. ఆయన ప్రతి వీధిలోనూ రాజుగారి శిలావిగ్రహాలు ఏర్పాటుచేయడం చూసి, రాజుగారి సైనికులను అందుకు కారణం ఏమిటని

జంధ్యం వెంకటేష్ బాబు

అడిగాడు. ఆ సైనికులు రాజుగారి మనసు లోని మాట చెప్పారు.

వెంటనే కోటకు వెళ్ళి రాజుగారిని దర్శనం చేసుకున్నాడు. తన వెంట ఒక మట్టిబొమ్మను కూడా తీసుకువెళ్ళాడు ఆయన. రాజుగారిని చూసిన వెంటనే ఆయన తన చేతిలోని బొమ్మను నేలకు వదిలాడు. బొమ్మ నేలను తాకడంతోనే పగిలిపోయింది. ప్రబంధుడు పగిలిన బొమ్మను చూస్తూ "అయ్యో! నా కీర్తి పగిలిపోయిందే" అని విలపించసాగాడు.

మహారాజుకు సాధువు చర్య ఏమీ అర్థం కాలేదు. "స్వామీ! మట్టిబొమ్మ పగిలిపోతే మీ కీర్తి పగిలిపోయిందని మీరు అంటున్నారు! నా కేమీ అర్థం కావటం లేదు. విషయ మేమిటో వివరించండి.

"మహారాజా! పగిలిన ఆ బొమ్మ నా ప్రతిరూపం. నా ప్రతిరూపం నాలుగు కాలాలపాటు ఉంటే నా కీర్తి కూడా నాలుగు కాలాలపాటు ఉంటుందని ఆశపడ్డాను. ఇప్పుడు నా బొమ్మ పగిలిపోయింది. నా కీర్తి కూడా పోయిందే అని నేను బాధ పడుతున్నాను" చెప్పాడు సాధువు.

మహారాజుకు సాధువు మాటలలో అమాయకత్వం కనుపించింది.

"స్వామీ మీ రేదయినా ఘనకార్యం సాధించి ఉంటే మీ కీర్తి నాలుగు కాలాల పాటు ఉంటుంది. ఏ ఘనకార్యం లేకుండా కేవలం మీ ప్రతిరూపాన్ని మిగిల్చితే మీ కీర్తి నాలుగు కాలాల పాటు ఎలా ఉంటుందనుకుంటున్నారు?" ప్రశ్నించాడు మహారాజు.

సాధువు వెంటనే "నేనూ అదే ప్రశ్నించాలనుకుంటున్నాను మహారాజా! ఎలాంటి మంచిపనీ చేయకుండానే, కేవలం వీథికో శిలా విగ్రహం స్థాపించడం ద్వారా మీరు శాశ్వత కీర్తిని సాధించాలని ఎలా అనుకుంటున్నారు?" ఎదురు ప్రశ్నించాడు సాధువు.





మహారాజుకు సాధువు మాటలలోని అసలు అర్థం బోధపడింది. తన అజ్ఞానం తొలగిపోయింది.

"రాజా! శిలావిగ్రహాలను చూడటంతోనే ప్రజల మనసు మీ మీద లగ్నం అవుతుందని ఆశించడం పొరపాటు. ప్రజల మనసులలో స్థానం సంపాదించుకునేందుకు శిలావిగ్రహాలు సరయిన సాధనాలు కావు. ప్రజల మనసులలో చిరస్థాయిగా నిలచిపోవాలంటే మీరు ప్రజలకు గుర్తుండిపోయే పనులు చేయాలి. తటాకాలు త్రవ్వించండి! సత్రాలు కట్టించండి! దేవాలయాలు నిర్మించండి! అప్పుడే మీరు ప్రజల మనసులలో చిరకాలం ఉండిపోతారు. మీ కీర్తి శాశ్వత కీర్తి అవుతుంది" అంటూ వివరించాడు సాధువు.

శ్యామలవర్మ ప్రబంధుడి సలహా పాటించి 'శాశ్వత కీర్తి'ని సంపాదించుకున్నాడు. *



## క్రిస్మస్ కానుక

పి. ఉమశ్రీ
కేరాఫ్
పి. సీతారామరాజు
R.T.C. (A.D.C.)
న్యూ కాలనీ,
గజపతి నగరం

## అదృష్ట పాఠకురాలు

అక్టోబర్ నెల సంచికలోని కూపన్ కత్తిరించి, కార్డుమీద అతికించి అదే నెల పదిహేనవ తేదీ లోపు మాకు పంపిన పాఠకుల్లో ఒకరిని 'డ్రా' తీసి ఎన్నుకోవడం జరిగింది. ఆ విధంగా ఎన్నికైన ఈ పాఠకురాలికి 'క్రిస్మస్ కానుకగా పదివేల పైసలు పంపడం జరిగింది.

అట్ట వెనక కథ

# సైతాన్

అర్ధరాత్రి...అమావాస్య. ఆకాశంలో నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నాయి. నక్కలు వికృతంగా అరుస్తున్నాయి. రానున్న ప్రళయానికి సాంకేతికంగా ప్రకృతి మారుతోంది. ఉత్తర దిశలో ఒక అరుణ బింబం తలెత్తింది. ఆ బింబం అంత కంతకు పెద్దదై భయంకర సాలెపురుగుగా మారింది.

అది నిప్పులు కురుస్తున్న కళ్ళతో రుమేనియా దేశంలో గ్రామాలమీద పడి మనుషులను పీక్కుని తినసాగింది. ఎంత మందిని పీక్కు తింటున్నా దాని ఆకలి తీరడంలేదు. ప్రజలు భయభ్రాంతులై పారిపోసాగారు. వారు అలా పారిపోతుంటే తరిమి తరిమి ఆ పురుగు అందినంతవరకూ తినెయ్యసాగింది. సూర్యోదయం అయింది. దారుణ మారణహోమానికి తాత్కాలికంగా తెర పడింది.

భయభ్రాంతులైపోయిన రుమేనియా నగర గ్రామవాసులు రుమేనియా రాజు విక్టర్‌ని కలుసుకుని జరిగిన అరాచకాలు వివరించారు. విక్టర్ నిర్ఘాంతపోయి సర్వసైనికులనూ అప్రమత్తపరచి ఆ రాత్రి పహరా ఏర్పాటు చేసాడు.

మళ్ళీ రాత్రి కాగానే భీభత్సం మొదలైంది. కాని అది సామాన్యమైన పక్షి కాదు. మహాశక్తివంతమైనది. దాన్ని చంపడానికి రకరకాల ఆయుధాలు దానిమీద విసరసాగారు. అయినా అది కదలలేదు. ఆ ఆయుధాలు దాన్ని తగిలి ముక్క ముక్కలు అయిపోయాయి. ఆ ప్రళయం అంతమయ్యే మార్గం ఏమిటో ఎవరికీ తెలియలేదు. సర్వ సైన్యాధ్యక్షుడు జువానా అతి కష్టంమీద ప్రాణాలు కాపాడుకుని బ్రతికాడు. సూర్యోదయం కాగానే పక్షి అదృశ్యమైంది.

సైన్యాధ్యక్షుడు జువానా రాజు విక్టర్‌ని కలుసుకుని జరిగింది వివరించాడు. ఒక రాత్రి ఇరవైవేల మంది సైనికులు మరణించారన్న వార్త విని విక్టర్ నిర్ఘాంతపోయాడు. ఆ అరాచక శక్తిని అణచకపోతే యావత్ ప్రపంచానికే ముప్పు అని భావించి తానే స్వయంగా మిగిలిన సైనికులను వెంటబెట్టుకుని ఎదిరిద్దామని నిర్ణయించుకున్నాడు. ఆ సమయంలో రాజదర్శనార్థం రుమేనియా చర్చి ఫాదర్ జోసఫ్ అక్కడకు విచ్చేసారు.

చర్చిలో ప్రభువు సేవకు పరిపూర్ణంగా అంకితమైన ఆయన రాజదర్శనానికి రావడం విక్టర్‌కు ఆశ్చర్యంవేసి ఆయనకు సవినయంగా నమస్కరించి రుమేనియా దేశానికి వచ్చిన అరిష్టం చెప్పుకున్నాడు.

జోసెఫ్ విక్టర్‌ని చూసి చిరునవ్వు నవ్వి—

"విక్టర్!......ఆ దుష్టశక్తి సామాన్యమైనది కాదు. సైతాన్ సర్వశక్తులూ దాన్లో నిక్షిప్తం చేసి దాన్ని సృష్టించాడు. ప్రపంచాన్ని భయభ్రాంతులను చేసి తన అధీనంలోకి తెచ్చుకోవాలని సైతాన్ ప్రయత్నం. దీన్ని ఎది



రించడానికి మీ సైనికసంపద సరిపోదు. దైవ బలం కావాలి!" అన్నారు.

"అది కావాలంటే ఏంచెయ్యాలి ఫాదర్?" అడిగాడు విక్టర్.

"ఆత్మార్పణ చేసే ధైర్యం కావాలి. ఈ రుమేనియా దేశంకోసం నిస్వార్థంగా ప్రాణాలు తెగించి బలిదానం చెయ్యగల మహావీరుడు కావాలి" అన్నాడు.

"ఈ దేశ మహారాజుగా అది నా బాధ్యత ఫాదర్. అందువల్ల నేనే ఆ పనికి సిద్ధమవుతాను. ఈ దేశపు ప్రజలందరికీ రాజు తండ్రి లాంటివాడు. ఏ బిడ్డనీ నేను ఆ దుష్టశక్తికి సమర్పించలేను. నన్ను నేనే సమర్పించుకుంటాను!" అన్నాడు విక్టర్.

జోసెఫ్ ప్రశంసాపూర్వకంగా విక్టర్ ని చూస్తూ పవిత్ర జలం విక్టర్‌పైకి జల్లాడు. అంతే విక్టర్ శరీరం ఉక్కు లా తయారై పోయింది. మహాబలశాలిగా తయారయి పోయాడు. ఫాదర్‌కు నమస్కరించి ఆ రాత్రి విక్టర్ ఒంటరిగా వెళ్ళాడు.

అర్ధరాత్రి అయింది. సాలీడు భయంకరంగా అరుస్తూ వచ్చింది. విక్టర్ దాన్ని లక్ష్యపెట్ట లేదు. ఆకాశంలో తనూ ఎగిరి దాన్ని పిడి గుద్దులు గుద్దాడు.

సైతాన్ శక్తితో అవతరించిన సాలీడు దెబ్బ తినడం అదే మొదలు! అందుకే అపూర్వ సంకెళ్ళతో విక్టర్‌ని బంధించి ఆతనిపై దాడి మొదలుపెట్టింది.

దాని భయంకర దాడికి చిత్రహింసలు అనుభవిస్తూనే జీసస్‌ను తల్చుకుని శరీరంలో శక్తినంతా కేంద్రీకరించి ఆ సంకెళ్ళను పగల గొట్టాడు విక్టర్. పక్షి నిర్ఘాంతపోయింది! ఆ రెండు సంకెళ్ళతో దాని కళ్ళమీద కొట్టాడు.

అది భయంకరంగా అరిచింది. అంధకార మైన కళ్ళలోంచి కురిసిన అగ్నిజ్వాలలు ఆ పక్షిని నిలువునా దహించివేసాయి. కొండంత బూడిదగా ఆ పక్షి రాలిపడిపోయింది. దైవ శక్తిని నాశనం చేసి తన శక్తిని చాటుదామను కున్న సైతాన్ జీసస్ ముందు మరోసారి ఓడి పోయాడు. *



ప్రభూతం కార్యమల్పం వాయన్నరః
కర్తుమిచ్ఛతి ।
సర్వారంభేణ తత్కార్యం సింహాదేకం
ప్రచక్షతే॥

ఎవరైనా ఒక పనిని సాధించుటకు మనస్సులో తలచినప్పుడు ఆ పని కష్టతరమైనా దానిని అన్ని విధాలుగా కష్టించి సాధించుట అనే మంచి లక్షణ మును పట్టిన పట్టు వదలని సింహము నుండి నేర్చుకొనవలెను.

ఇంద్రియాణితు సంయమ్య బకవత్
పండితో నరః ।
దేశ కాల బలం జ్ఞాత్వా సర్వకార్యాణి
సాధయేత్॥

కొంగ ఏ విధముగా తనకు కావలసినది సాధ్య మగువరకు ప్రతి అంగమునూ కదలనీయక నిశ్చ లముగా కార్యసాధన కొరకు వేచియుండునో, అదే విధముగా ఆత్మేంద్రియ చలనము లేక దేశ, కాల బలములను తెలుసుకుని కార్యమును సాధించవలెను.

ప్రత్యుత్థానంచ యుక్తంచ సంవిభాగంచ
బంధుషు ।
స్వయమాక్రమ్య భోగంచ శిక్షేచ్ఛత్వారి
కుక్కుటాత్॥

నాలుగవ ఝామున నే మేల్కొనుట, యుద్ధము నందు వెన్ను చూపకుండుట, బంధువులయందు ప్రతి వస్తువునూ సమముగా పంచుట, స్వప్రయ త్నముచేత భోజనము సంపాదించుకొనుట, ఈ నాలుగు సద్గుణములూ కోడి ద్వారా నేర్చుకొన వచ్చును.

సబ్బు నరసింహం (నూనెపల్లె)




(గతసంచిక తరువాయి)

"అయ్యో! బంతి నూతిలో పడిపోయింది!" అన్నాడు దుర్యోధనుడు.

"అది మామూలు బంతి కాదు అన్నయ్యా! బంగారు బంతి!" అన్నాడు దుశ్శాసనుడు.

"తేరతిండి తిని బాగా పొగరుపట్టిన ఈ భీముడు మన బంగారు బంతిని నూతిలో పడేసాడు" దుర్యోధనుడు కోపంగా అన్నాడు.

"అందరం కలిసే గదా ఆడుకుంటున్నాము. నేనొక్కణ్ణే బావిలో పడేసానా?" భీముడు గద్దించాడు.

"నీవు అంత ఎత్తుకి ఎగరతన్నకపోతే నూతిలో పడేదే కాదు!" దుశ్శాసనుడు రెట్టించాడు.

"ఎవరు తన్నారో వారే తీస్తారు. పొగరుబోతు భీమయ్యా! మా బంతి మాకు తీసివ్వు!" అన్నాడు దుర్యోధనుడు.

"అంత లోతు నీరున్న బావిలో దిగి ఆ బంతిని ఎవరు మాత్రం ఎలా తీయగలరు? చెప్పు దుర్యోధనా?" అన్నాడు యుధిష్టరుడు.

"తమ్ముడంటే అంత ప్రేమ వుంటే నువ్వే ఆ నూతిలో దిగి బంతి తీసివ్వు!" అన్నాడు దుశ్శాసనుడు.

"ఒరేయ్! మా పెద్దన్న గారిని నూతిలో

మధురాధర్



దిగమంటావురా!'' అంటూ భీముడు ఆవేశం పట్టలేక దుశ్శాసనుడి మీదకు వెళ్ళబోయాడు. మధ్యనే దుర్యోధనుడు అడ్డుపడి ''ఆగవోయ్ బండ భీమయ్యా! మాక్కావల్సింది బంతి మీరు ఎవరు దిగినా సరే!'' అన్నాడు.

''నీ బంతిని నువ్వే ఆ నూతిలో దిగి తీసుకో!'' అంటూ భీముడు దుర్యోధనుడ్ని చేతులు గట్టిగా పట్టుకుని నూతివేపు లాక్కెళ్ళాడు. కాబోయే యువరాజుని, తన అన్నగారిని అలా లాక్కువెళ్ళటం చూసిన దుశ్శాసనుడు ''ఒరే! భీమసేనా! నీకెంత పొగరురా! ముందు మా అన్నగారిని వదుల్తావా లేదా?'' అంటూ భీమునిమీద కలబడ్డాడు. సుయోధనుని వదలి దుశ్శాసనుని మీద కెగిరాడు భీముడు. వారిద్దరూ ముష్టియుద్ధానికి తల పడ్డారు.

అది చూసి దుర్యోధనుడు ''మా రాజ్యంలో కొచ్చి మామీదే దౌర్జన్యాలు సాగిస్తున్నారే!'' అని భీముడిని మరొక వైపు నుంచి పిడి గుద్దులు గుద్దుతున్నాడు.

''మీ రాజ్యమా? నా తండ్రి పాండురాజు రాజ్యం ఇది!'' భీముడు పౌరుషంగా అన్నాడు.

''భీమా! ఇది సమయం కాదు ఆగు... వుద్రేకం తగ్గించు!'' అన్నాడు పాండురాజు కొడుకు యుధిష్ఠిరుడు.

''పోనీలే పాపం అని తిండి పెట్టి నీడ కల్పిస్తే మా రాజ్యానికే ఎసరు పెడుతున్నారా!'' గర్వంగా పలికాడు దుర్యోధనుడు.

''మా తండ్రి పాండురాజు రాజ్యంలో మాకు నీడ కల్పించటమేమిటి?'' అన్నాడు అర్జునుడు కల్పించుకొని.

''ఓరి వెర్రి మోహమా! నీ తండ్రి పాండురాజు ఏనాడో పిరికిపందలా రాజ్యాన్ని వద్దని అడవుల్లోకి పారిపోయాడు'' దుశ్శాసనుడు గేలి చేయగా పాండుపుత్రులకి అయిదుగురికీ పౌరుషం పొంగుకొచ్చింది. బలవంతుడైన భీముడికి మరింత ఆవేశం వచ్చి దుశ్శాసనుణ్ణి రెండు చేతులతో ఎత్తాడు. దుర్యోధనుడు తన తమ్ముడి అవస్థ చూసి ''ఏయ్! భీమా! నా సోదరుడిని దింపుతావా లేదా?'' అన్నాడు.

''దించకపోతే ఏం చేస్తావు?'' అన్నాడు అర్జునుడు.

''మేమందరం కలసి భీముడిని చంపేసి

మా తమ్ముడిని రక్షించుకుంటాము!''

''భీముడి మీద దెబ్బ పడితే చూడండి.... అసలైన క్షత్రియ పౌరుషం రుచి చూపిస్తాను!'' అర్జునుడు ఆవేశంగా అన్నాడు.

భీముని చేతులమీద వున్న దుశ్శాసనుడు ''అన్నయ్యా! ఈ అడవి దున్నలకి అసలైన క్షత్రియ పౌరుషం అంటే ఏమిటో కూడా తెలుసా! పెద్ద వీరాధి వీరుడిలాగా మాట్లాడు తున్నాడే ముందు వాడి నోరు నొక్కు!'' అన్నాడు.

''ఒరేయ్! నా తమ్ముడిని ఏమన్నా చేసారా చూడు నిన్ను చంపేసి నూతిలోకి విసురుతా!'' భీముడు దుశ్శాసనుణ్ణి గిరగిరా తిప్ప సాగాడు. భీముని చేష్టలకు భయపడిన దుశ్శాసనుడు ''అన్నా! సుయోధనా! రక్షించు... రక్షించు...!'' అంటూ బిగ్గరగా అరిచాడు.

''అన్నా! వాడిని నువ్వు చంపొద్దు. నేను చంపేస్తాను కిందకు దింపు!'' అన్నాడు పాండవ మధ్యముడు అర్జునుడు. భీమునితో ఎలాగూ గెలవలేమనుకున్న దుర్యోధనుడు అర్జునుని మీద ముష్టియుద్ధానికి తలబడిన దుర్యోధనుడు.

''నా తమ్ముణ్ణి చంపేటంతటి వీరాధి వీరుడివా! జగదేకశూరుడివా నువ్వు!'' అంటూ అర్జునుని మెడపట్టి గెంటాడు.

''భగవంతుడు చల్లగా చూస్తే ఈ ఆర్య పుత్రుడు వీరాధివీరుడూ అవుతాడు, జగదేక శూరుడవుతాడు నాయనా!'' అంటూ వెనుక నుంచి గంభీర స్వరంతో పల్కి వారి ముందు కొచ్చి నిల్చాడు ఒక అపరిచిత వ్యక్తి. బ్రహ్మ



తేజస్సు ఉట్టిపడే ఆ వ్యక్తి నుదుటన విభూతి రేఖలు, మధ్య ఎర్రని కుంకుమ బొట్టు, నల్లగా మిలమిల మెరిసే గడ్డం, మునీశ్వరు నిలా పైన ముడివేసుకున్న జుట్టు, నల్లని శరీరఛాయతో కాషాయాలు ధరించి, నిలువెత్తు విల్లు బుజాన వేలాడుతుండగా వీపున అమ్ముల పొది అపర పరశురాముడనిపించే లాగా వున్నాడు ఆయన.

ఆయన రాకను చూసిన రాజపుత్రు లందరూ ఎక్కడి వారక్కడ నిశ్శబ్దంగా నిల బడిపోయారు.

''ఆటలాడుకోవలసిన ఈ వయస్సులో పోట్లాడుకుంటున్నారేమిటి నాయనా!'' అనడి గాడు.



''ఆ తిండిపోతు భీముడు నా బంగారు బంతిని నూతిలో పడేసి, తీసివ్వరా అంటే మా మీద దౌర్జన్యం చేస్తున్నాడు!'' భీముణ్ణి చూపిస్తూ అన్నాడు దుర్యోధనుడు.

''నాయనా! భీమా! ఆ పైన వున్న బాలుడిని దింపు. నూతిలో పడిన బంతిని నేను తీసి యిస్తాను'' అనగానే భీముడు తన చేతుల మీద వున్న దుశ్శాసనుడిని దింపాడు.

''మరి మా బంగారు బంతి మాకు తీసివ్వండి!'' అన్నాడు దుర్యోధనుడు.

''అదేమంత పెద్ద పనికాదు. రండి తీసిస్తాను'' అంటూ అందరూ నూతి దగ్గరకు వెళ్ళారు.

నూతిలో నీటి అడుగున మునిగివున్న బంగారు బంతి తళతళా మెరుస్తోంది. దాన్ని చూసిన ఆచార్యుడు విల్లు తీసి బాణాన్ని సంధించి గురిచూసి నీటిలో వున్న బంగారు బంతి మీదకు వదిలాడు. ఆ బాణం రివ్వున వెళ్ళి బంతిలో దిగబడిపోయింది.

''ఆహా! భలే...భలే! బంతిలో బాణం గుచ్చుకుంది!'' అన్నారు నూతి చుట్టూవున్న రాకుమారు లందరూ. వెంటనే మరొక బాణం తీసి నీటిలో బాణానికి అంటుకునేలాగా వేసాడా ధనుర్ధారి. ఆ బాణం వెళ్ళి మొదటి బాణానికి అంటుకుపోయింది. ఆ విధంగా చకచకా బాణాలు వేస్తూ నూతి పైదాకా బాణ తోరణం కట్టి నూతిలో నీరుతోడిన విధంగా ఆ బాణపాశాన్ని పైకిలాగి చివరి బాణంతో బంధించబడిన బంగారు బంతిని పైకి తీసి యిచ్చాడా శరనిపుణుడు.

బంగారు బంతిని అందుకున్న దుర్యోధనుడు ఆనందం పట్టలేక ''ధన్యవాదాలు గురువుగారూ!'' ఇంతటి ప్రతిభ కలిగిన మీ పేరు ఏమిటి స్వామీ!'' అన్నాడు.

''పేదవాడికి పేరెందుకు నాయనా! ఎన్ని ప్రతిభలున్నా కన్నకొడుక్కి పాలు తెచ్చివ్వలేని నిరుపేద తండ్రిని. లక్ష్మి, సరస్వతులు ఒకచోట కలసి వుండవని చెబుతారు. అలాగే నాకు సరస్వతీ కటాక్షం వుంది కానీ లక్ష్మి కటాక్షం కలగలేదు. అన్ని విద్యలూ తెలిసి కూడా అజ్ఞాన జీవితాన్ని గడుపుతున్నాను నాయనా! కౌరవ రాజకుమారులైన మీరు నా ప్రతిభను గుర్తించారు నా కదే చాలు!'' అన్నాడాయన నిర్వేదంగా.

అక్టోబర్ నెల బొమ్మాయి చాలా బాగుంది। ఈ నెల జోక్స్ అద్భుతంగా వున్నాయి. అట్ట వెనుక బొమ్మ కథ నిజంగా చాలా బాగుంది.

—బి. హనుమత్ ప్రసాద్ (గుంటూరు)

అట్ట వెనుక బొమ్మకథ 'జీనియస్' చాలా బాగుంది. 'తేనెటీగ' గురించి పూర్తిగా తెలుసుకున్నాం. 'ధరణీరాయ్ చౌదరి'గారి జానపద కథ 'అగ్నికణం' వెర్రెటీగా వుంది మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది. ఉత్తమ రచనకు బహుమతి ప్రకటిస్తే బావుంటుంది. చిత్రకారుల విషయంలో మీరు చూపెట్టిన మార్గం ప్రశంసనీయం।

—మీర్ నుసరత్ అలీఖాన్ (పడగల్)

ఈసారి 'తాతయ్య కబుర్లు' పంచికకే వన్నె తెచ్చింది. అట్టవెనుక బొమ్మకథ 'లిటిల్ డిటెక్టివ్' కథలు చాలా బాగున్నాయి.

—యమ్. డి. ఇనాయత్ ఖాన్ (చెన్నూర్)

కల్పనాకృత కథలకు అవకాశము తగ్గించి, విజ్ఞానదాయకమైనట్టి అంశాలు క్రోడీకరింపగలరనియు, తాతయ్య ప్రశ్నావళి యొక్క సంఖ్య పెంచగలరనియు, జాతీయ ప్రాముఖ్యత గలవి, చారిత్రక అంశాలు దృష్టిలో ఉండేటట్లు జాగ్రత్త వహించగలరని భావిస్తున్నాము.

—కునుకు శంకరరావ్ (సిహెచ్ బొడ్డవలస)

ఈసారి పంచికలోని కథలు చక్కని ఇతివృత్తంతో కూడుకుని ఎంతో ఆనందాన్నిచ్చాయి. పాఠకులు పాల్గొనే శీర్షికలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నందుకు ప్రత్యేక అభినందనలు తెల్పకుండా వుండలేకపోతున్నాను.

కె. వి. యస్. రామారెడ్డి (పిట్టల వేమవరం)

ముఖచిత్ర కథతోబాటు 'జీనియస్', 'కష్టార్జితం', 'సంస్కారం', 'కాలచక్రం' కథలు కూడా బావున్నాయి.

—పైల సుధాకర్, రామకృష్ణ (ఏలూరు)

'లిటిల్ డిటెక్టివ్' కథలు చాలా ఆసక్తికరంగా వున్నాయి. ఈ నెల కథ 'జీనియస్' నాకు చాలా బాగా నచ్చింది.

కె. విజయబాబు (పచ్చల తాడిపర్రు)

'లిటిల్ డిటెక్టివ్' కథ మా పిల్లలకి ఆనందాన్ని పంచినది. ఇంకా అనేక కథలను, జోక్స్‌లను ఇచ్చిన మీకు మా కృతజ్ఞతలు।

—కె. గుణశేఖర్ (తిరుపతి)

మరే ఇతర పత్రికలలో లేని ప్రత్యేకత - మన పత్రికలోని అట్టవెనుక బొమ్మ, దాని కథ। ఈ నెల కూడా అట్ట వెనుక బొమ్మ, దానికి సంబంధించిన కథ చాలా బాగున్నాయి. అన్ని కథలకంటే 'సంస్కారం' కథ ఉత్తమంగా వుంది. మధురమైన తేనె నందించే 'తేనెటీగ'ల గురించి తెలియ జేసిన డా॥ రోహిణీకృష్ణగారికి ధన్యవాదాలు. లోపలి పేజీల్లోని బొమ్మలపై కాస్త శ్రద్ధ చూపించండి।

—ఎస్. శ్రీనివాస్ (మూనెపల్లి)

డా॥ రోహిణీకృష్ణగారు 'తేనెటీగల' గురించి చక్కగా వివరించారు. 'లిటిల్ డిటెక్టివ్' కథ చాలా బాగుంది. 'తాతయ్య కబుర్లు' నాకు చాలా నచ్చింది. ఇంత చక్కగా ప్రశ్నలకి సమాధానాలిచ్చే తాతయ్యను చూడాలనుంది. కనీసం వారి ఫోటో అయినా ప్రచురించండి....ప్లీజ్।

—పి. సాయినాగరాజ్ (అనంతపురం)

## అక్టోబర్ నెల పజిల్స్ సమాధానాలు

మేధావి నాదం: (Voice of the wiseman):

1) భాగవతుల శంకరశాస్త్రి

2) 'సినీవాలి' అంటే 'సినిమాలో వాలి' అని కాదు. 'పార్వతీదేవి' అని అర్థం. 'చంద్ర కళ' అనబడే అమావాస్యను కూడా 'సినీ వాలి' అంటారు. ఏదైనా కరెక్టే!

3) 13-9-1989

4) శ్రీరంగం శ్రీనివాసరావు

5) ఆరుద్ర

6) అడవి బాపిరాజు

7) అల్లుడయ్యే జగ్గయ్యే

8) కొంపెల్ల జనార్ధనరావు

9) చలం

10) మనసు కవి

11) ఠాగూర్‌గారే!

12) వైతాళికులు.

సరైన సమాధానం ఎక్కువమంది వ్రాయడం వల్ల డ్రా పద్ధతిలో ఈ క్రింది ముగ్గురిని ఎంపికచేసి ఒక్కొక్కరికీ 50 రూ॥లు చొప్పున పంచడం జరిగింది.

1. ఆర్ నాగలక్ష్మి (కర్నూలు) 2. వై. రాజారావు (కాకినాడ) 3. టి. రాజేశ్వరరావు (తెనాలి).

ఇక మిగిలిన విజేతల్ని రెండవసారి డ్రా పద్ధతిలో పదిమందిని ఎంపిక చేసి వారికి ఈ నెల సంచిక బహుమతిగా పంపబడుతుంది.

1. పి. ...రెడ్డి (మద్రాసు) 2. ఎ. కృ... ప్రసాద్ (ఎమ్మిగనూరు) 3. కె. శ్రీనివాసమూ... (ఎమ్మిగనూరు) 4. సి. రఘుపతి (చిత్తూరు) ... ఎస్. రాజేంద్రప్రసాద్ (ఏలూరు) 6. టి. వెం... లక్ష్మి 7. ఇ. రేణుక (భీమవరం) 8. డి. స... రత్నం (వరంగల్) 9. జె. అనీల్‌కుమార్ (తుని... 10. పి. రమ (తడ)

బుజ్జాయి పజిల్ సమాధానం:

(1) A–D (2) D–F (3) C–... (4) C–F (5) A–D (6) B–H.

సరైన సమాధానం ఎక్కువమంది వ్రాయడ... వల్ల 'డ్రా' పద్ధతిలో ఈ క్రింది ముగ్గురిని ఎంపి... చేసి ఒక్కొక్కరికీ 50 రూ॥లు చొప్పున పంచడ... జరిగింది.

1. పి. హరనాథ్ (విశాఖపట్నం) 2. ఎమ్. ఉమ (రాజోలు) 3. కె. వి. సూర్యనారాయణ (నరసాపురం)

ఇక మిగిలిన విజేతల్ని రెండవసారి డ్రా పద్ధతిలో పదిమందిని ఎంపిక చేసి వారికి ఈ నెల సంచిక బహుమతిగా పంపబడుతుంది.

విజేతలు:

1. ఎస్. ఆదిలక్ష్మి (విజయవాడ) 2. వై. ధర్మరాజా (కాకినాడ) 3. సి హెచ్. కాశీవిశ్వేశ్వరరావు (అనపర్తి) 4. మీర్ బషరత్ అలీఖాన్ (వరంగల్) 5. ఎ. మల్లికార్జునరావు (రాజమండ్రి) 6. పి. పాండురంగమ్మ (విజయవాడ) 7. బి. రంగమ... (గుంటూరు) 8. కె. పి. సి. రాజా (గుడివాడ) 9. కె. సీతారత్నం (వల్లెవాడ) 10. యు. కన... (అనకాపల్లి)

Edited & Published by G. A. Rao, at No. 27, Gopala Krishna St, T. Nagar, Madras-17. Phone: 445423, Printed at Soundaram Printers. Madras-21. For Ramanjneya Press, Rajahmundry-1.